Licenced to Post without Prepayment (AP/VJ-16/WPP/2012-13)
స్థాపకుడు: నెల్లూరు వెంకట్రామానాయుడు స్థాపితం: 1930 జీవప్రదాత: నెల్లూరు శ్రీరామమూర్తి
*Longest Living Newspaper in Telugu Journalism*
జమీన్ రైతు
సంపుటి: 83 • సంచిక: 20 • 17-5-2013 శుక్రవారం • పేజీలు: 16 • విడి ప్రతి: రూ.5/-



### దుగరాజపట్నం ఓడరేవుకు

# పచ్చజెండా వూపిన ప్రధాని!

**చింతా మోహన్ ఆరుసార్లు ఎమ్పీగా గెలిచాడు. 1985 నుంచి ఢిల్లీలో ఒక కీలక వ్యక్తిగా చలామణి అవుతున్నాడు. ఇప్పటి పార్లమెంట్‌లో ఇంత సుదీర్ఘ అనుభవం వున్నవారు చాలా కొద్ది మంది. ఇన్నేళ్ల రాజకీయ ప్రాభవంలో జిల్లాకు, రాష్ట్రానికి పనికి వచ్చే పని ఒక్కటీ చేయలేదన్న అసంతృప్తి ఇటు ప్రజలలో, అటు ఆయనలో కూడా ప్రబలంగా వుంది. తాను చేసే పని ఏదైనా శాశ్వతంగా నిలిచిపోయేట్లు వుండాలన్నది చింతా మోహన్ కోరిక. ఆ కోరికకు అన్ని విధాల సంతృప్తి పరచే విజయం దుగరాజపట్నం ఓడరేవు సాధించడం.**



దుగరాజపట్నం ఓడ రేవుకు పచ్చ జెండా వూపాడు ప్రధానమంత్రి మన్మోహన్ సింగ్. ఇక్కడ ఓడ రేవు నిర్మాణానికి కేంద్ర క్యాబినెట్ ఆర్థిక వ్యవహారాల కమిటీ ఆమోదం తెలిపింది. 5వేల ఎకరాల సువిశాల విస్తీర్ణంలో, 8వేల కోట్ల రూపాయల పెట్టుబడితో నిర్మించనున్నారు దీన్ని.

దుగరాజపట్నం ఓడరేవుకు నాలుగు వందలేళ్ల చరిత్ర వుంది. బ్రిటీష్ వ్యాపారులు భారతదేశానికి వచ్చిన తొలిదినాలలో ఇక్కడొక ఓడరేవు కట్టారు. దానికి అనుబంధంగా ఒక లైట్ హౌస్ కూడా నిర్మించారు. చిన్నపాటి కోట కట్టుకొన్నారు. భారతదేశంలో బ్రిటీష్ దొరలు నిర్మించిన మొట్టమొదటి ఓడ రేవు ఇదే కావడం గమనార్హం. ఆనాటి వెంకటగిరి జమీందారు వారికి ఆ అనుమతి మంజూరు చేశాడు. అయితే తొలిదినాలలోనే భారీ తుఫాను వచ్చిపడింది. దాని ధాటికి ఓడరేవు చెల్లాచెదరైపోయింది. కట్టుకొన్న కోట కూలి పోయింది. దానితో భయపడి, ఆర్కాట్ నవాబు అనుమతితో చెన్నపట్నంలో మరొక ఓడరేవు కట్టుకొని, దీన్ని మూతవేశారు. తర్వాతి కాలంలో ఆ చెన్నపట్నమే మద్రాసు మహానగరంగా రూపాంతరం చెందింది. ఆ తుఫాను అనేది రాకుండా వుంటే ప్రపంచ పటంలో చెన్నై స్థానంలో దుగరాజపట్నమే నిలిచి వుండేది. నెల్లూరు జిల్లాకు ఆ దినాలలోనే రాజవైభోగం సిద్ధించి వుండేది. ఆనాటి తీపి జ్ఞాపకాలకు గుర్తుగా బ్రిటీష్ వారు నిర్మించిన ఆర్ముగం లైట్‌హౌస్ ఇప్పటికీ నిలిచే వుంది. ఆర్ముగం అనే గ్రామ కరణం తమకు చేసిన సహాయానికి గుర్తుగా ఈ లైట్ హౌస్‌కు ఆ పేరు పెట్టారు బ్రిటీష్ దొరలు.

మళ్లీ ఇన్నేళ్లకు దుగరాజపట్నంలో కొత్త ఓడరేవు రానున్నది. ఈ నిర్ణయం వెనుక చాలా కృషి వుంది. తిరుపతి ఎమ్పీ చింతా మోహన్ కలల ప్రాజెక్ట్ ఇది. దాదాపు నాలుగైదేళ్ల నుంచి దీనికోసం తన రాజకీయ పలుకుబడి సమస్తాన్ని వెచ్చించి పని చేశాడాయన. భారతదేశంలో ప్రభుత్వ రంగంలో 13 ఓడరేవులున్నాయి. ఏటా 550 మిలియన్ టన్నుల సరకుల రవాణా జరుగుతున్నది. అయితే మనం ఆశిస్తున్న ఆర్థిక అభివృద్ధి వేగానికి ఈ సామర్థ్యం ఎంత మాత్రం సరిపోదు. చైనా దేశంలో దాదాపు 5 బిలియన్ టన్నుల సామర్థ్యం కల్గిన ఓడ రేవులున్నాయి. అంటే మనకంటే పది రెట్లు అధికం. 2020 నాటికి మన ఓడరేవుల సామర్థ్యాన్ని కనీసం మూడింతలు పెంచాలన్నది కేంద్ర ప్రభుత్వ లక్ష్యం. అందుకోసం తూర్పు తీరంలో రెండు భారీ ఓడ రేవులు నిర్మించాలని తలపెట్టారు. వాటిలో ఒక దానిని దుగరాజపట్నంలో నెలకొల్పాలని చింతా మోహన్ కోరాడు.

అయితే అందుకు ఎన్నో అడ్డంకులు వచ్చాయి. మొదటి సమస్య – కృష్ణపట్నం పోర్టు. ప్రైవేటు రంగంలో నిర్మితమైన ఆ ఓడరేవు పెట్టుబడి భద్రత కోసం, దానికి అటు ఇటు 80 కిలోమీటర్ల దూరంలో మరొక ఓడరేవు నిర్మించరాదని ఆంక్ష విధించింది రాష్ట్ర ప్రభుత్వం. ఆ ఆంక్ష నుంచి మినహాయింపు తేవడానికి చింతా మోహన్ తల ప్రాణం తోకకు వచ్చింది. ఆ వెంటనే శ్రీహరికోట రాకెట్ కేంద్రం శాస్త్రవేత్తలు అడ్డం పడ్డారు. తమ రాకెట్ ప్రయోగాలకు ఇది ఆటంకమని అభ్యంతరం చెప్పారు. మూడవ ప్రధాన సమస్య – నేలపట్టు పక్షుల రక్షిత కేంద్రం. కేంద్ర అటవీ చట్టం ప్రకారం నేలపట్టు రక్షిత కేంద్రానికి సమీపంలో పారిశ్రామిక సంస్థలు వేటినీ నెలకొల్పకూడదు. ఆ చట్టం చాలా కఠినమైనది. దాని నుంచి మినహాయింపులు తేవడం అంత సులభం కాదు. పైగా నేలపట్టు కేంద్రానికి ఐక్యరాజ్య సమితి గుర్తింపు కూడా వుంది. దానికి సంబంధించి ఏ చిన్న మినహాయింపు ఇవ్వాలన్నా అంతర్జాతీయ స్థాయిలో అడ్డంకులు తలెత్తుతాయి.

వీటన్నిటి వల్ల దుగరాజపట్నం ఓడరేవుకు రాష్ట్ర ప్రభుత్వం అంగీకారం తెలపలేదు. నెల్లూరు జిల్లా ఉత్తర సరిహద్దులో వున్న రామాయపట్నంలో ఓడరేవు కట్టుకోవచ్చునని సిఫార్సు చేసింది రాష్ట్ర ప్రభుత్వం. కానీ చింతా మోహన్ పట్టిన పట్టు వీడలేదు. ఆయనకు ప్రధానమంత్రితో వ్యక్తిగత స్నేహం వుంది. పివి.నరసింహారావు హయాం నుంచి నడుస్తున్న బంధం అది. దాని వల్ల ఆయనకు రాజకీయ ప్రయోజనం ఏదీ సిద్ధించలేదు. కేంద్ర మంత్రిత్వం వంటి బహుమానాలు ఏవీ ఇవ్వలేకపోయాడు మన్మోహన్‌సింగ్. వాటికి బదులుగా అంతకంటే వున్నతమైన, శాశ్వతమైన కానుకగా ఈ ఓడ రేవు మంజూరు చేయించాడు.

శ్రీహరికోట రాకెట్ కేంద్రం శాస్త్రవేత్తలను ఒప్పించే బాధ్యత నేరుగా ప్రధానే తీసుకోవడం వల్ల ఇంత గొప్ప పని సాధ్యమైంది. తాము రాకెట్లు ప్రయోగించే సమయంలో కనీసం 48 గంటల పాటు ఓడ రేవు కార్యకలాపాలన్నీ నిలిపివేసే షరతు మీద శాస్త్ర



వేత్తలు దీనికి ఆమోదం తెలిపారు. శ్రీహరికోటలో ఇప్పటివరకు ఒక లాంచ్ ప్యాడ్ మాత్రమే వుంది. ఇప్పుడు కొత్తగా రెండవది కట్టారు. ఈ రెండు లాంచ్‌ప్యాడ్‌ల ద్వారా ప్రస్తుతానికి ఏటా నుంచి 10 నుంచి 12 రాకెట్లు మాత్రమే నింగిలోకి వెళ్తు

కొరవ 14వ పేజీలో

# ఒక్క క్షణం కూడా వద్దు

ప్రధాని మన్మోహన్‌సింగ్ పదవీ పరిత్యాగం చేయాలని ప్రతిపక్షాల నుంచి తీవ్రమైన ఒత్తిడి వస్తున్నది. మన్మోహన్ సింగ్ పదవిలో కొనసాగడానికి తర్కమే లేదని ఎల్‌కె.అద్వానీ వ్యాఖ్యానించాడు. ఆయన వ్యక్తిగా నీతి నిజాయితీలకు కట్టుబడిన వాడు కాబట్టి, ప్రజా సేవలో నిబద్ధత కల్గిన వాడు కాబట్టి ప్రతిపక్షాలు సైతం అంతకు మించిన కఠిన విమర్శలు చేయలేక పోతున్నాయి. అయితే ఆ సులక్షణాలే పదవీ పరిత్యాగానికి ఆయనపై అధిక ఒత్తిడి తెస్తున్నాయన్నది నిజం. అందరు రాజకీయవాదుల వలె అవినీతి బురద మడుగులో మునకలు వేసే వాడైతే, మన్మోహన్‌సింగ్ మొండిగా కుర్చీపట్టుకొని వేలాడ వచ్చు. మన్మోహన్ సింగ్ ఆ కోవకు చెందిన వాడు కాదు కాబట్టే పాతికేళ్ల క్రితం పివి.నరసింహారావు ఆయన్ను ఆర్థికమంత్రిగా ఎంపిక చేశాడు. ఆర్థిక శాఖలో ఒక ఉద్యోగిగా గడిపిన వాడిని ఆర్థికమంత్రిగా నియమించడం అంటే సామాన్యమైన విషయం కాదు. ఎంతో ఉన్నతమైన వ్యక్తిత్వాన్ని, సమర్థతను రుజువు చేసుకోవడం వల్లనే అది సాధ్యమయ్యింది. ఆ అర్హతతోనే 2004లో సోనియాగాంధీ తన స్థానంలో మన్మోహన్‌సింగ్‌ను ఎంచుకొన్నది. జీవిత కాలం రాజకీయాలలో ప్రజల మధ్య బ్రతికిన వారిని, సుదీర్ఘ అనుభవం కల్గిన వారిని, పార్టీ విధేయత కల్గిన వారిని పక్కనపెట్టి మన్మోహన్‌సింగ్‌ను ఎంపిక చేయడానికి ఏకైక కారణం ఆయన వ్యక్తిత్వవైశిష్ట్యమే.

అంత గొప్ప మనిషి ప్రధానిగా విలువల విషయంలో మరుగుజ్జుగా మారిపోయాడు. ఆయన హయాంలో జరిగినన్ని అవినీతి కుంభకోణాలు భారతదేశ చరిత్రలో మరే ప్రధానమంత్రి పదవీ కాలంలో జరగలేదు. దాదాపు ప్రతి కుంభకోణంలో ఆయన నిర్వహించే శాఖలకు పరోక్ష ప్రమేయం కన్పిస్తున్నది. అయినా సరే ఇప్పటివరకు ఏ ప్రతిపక్ష పార్టీ కూడా ఆయన్ను వేలెత్తి చూపలేదు. కానీ బొగ్గు కుంభకోణంలో ఆయనకు ఆ మినహాయింపు లభించడం లేదు. ఆయన స్వయంగా శాఖను నిర్వహించే కాలంలో బొగ్గు గనులను గాలికిపోయే పేలపిండి రామార్పణం అన్నట్లు పందారం చేశారు. ప్రజల సంపదను కొల్లగొట్టడానికి ద్వారాలు బార్లా తెరిచారు. దానిపై సుప్రీంకోర్టు విచారణకు ఆదేశిస్తే, ఆ నివేదికను మాయ చేయడానికి స్వయంగా ప్రధానమంత్రి కార్యాలయ అధికారులే దుష్ట ప్రయత్నం చేశారు. సుప్రీంకోర్టును కూడా తప్పుదారి పట్టించారు. కోర్టు అక్షింతలు తట్టుకోలేక నివేదిక తారు మారుకు ప్రయత్నం చేసిన న్యాయశాఖ మంత్రి అశ్వినీకుమార్ తన పదవికి రాజీనామా చేశాడు. కానీ ప్రధాని మాత్రం ఈ నేరంతో తనకే నిమిత్తం లేనట్లు తప్పించుక తిరుగుతున్నారు.

చాలా పెద్ద తప్పు చేస్తున్నాడాయన. ఆయన మంత్రిగా వున్నప్పుడు నేరం జరిగింది. ఆ నేరంపై దర్యాప్తును ఆయన స్వంత అధికారులు తప్పుదారి పట్టించడానికి ప్రయత్నం చేశారు. నైతిక బాధ్యత వహించడానికి ఇంత కంటే గొప్ప పరిణామాలు ఏవీ అవసరం లేదు.

ప్రధాని పదవి మహోన్నతమైనది. ఆ పదవిలో వున్న వారు తప్పు చేయక పోవడమే కాదు, జరిగే తప్పులను క్షమించే వారుగా కూడా వుండకూడదు. కానీ ప్రధాని తప్పులను జరగనివ్వడమే కాక, వాటిని సమర్థిస్తున్నారు. ఒక విధంగా నేరానికి సహకారం అందజేస్తున్నారు. ప్రధాని హోదాలోనే కాదు, వ్యక్తిగత స్థాయిలో కూడా చేయకూడని పాపం అది. అందువల్లనే ప్రతిపక్షాలు ఆయన రాజీనామా కోరుతున్నాయి. ఆందోళన చేస్తున్నాయి.

ఒకరి చేత చెప్పించుకోక ముందే తనకు తానుగా నైతికబాధ్యతతో పదవీ త్యాగం చేసి వుంటే వ్యక్తిగా మన్మోహన్‌సింగ్ స్థాయి ఎంతో వున్నతంగా ఎదిగిపోయి వుండేది. ప్రజలు ఆయన పట్ల సానుభూతి వ్యక్తం చేసేవారు. మొండిగా కుర్చీ పట్టుకొని వేలాడడం వల్ల ప్రజల దృష్టిలో ఆయన చులకనై పోతున్నారు. ఇంతకాలం కష్టపడి పెంచుకొంటూ వచ్చిన వ్యక్తిత్వ వైశిష్ట్యం ఒక్కసారిగా నీరుగారి పోతున్నది. ఇప్పటికైనా తన తప్పు తెలుసుకొని ఒక్క క్షణం కూడా పదవిలో కొనసాగకుండా తప్పుకొంటే ఆయనకే మంచిది. లేకుంటే చరిత్రహీనుడిగా మిగిలిపోక తప్పదు.

జమీన్‌రైతు

## జనవాణి

### నిర్భయంగా బ్రతికేదెప్పుడు?

ఈ రోజుల్లో ఆడపిల్లలపై ఆత్యాచారాలు జరగలేదన్న రోజు ఏదైనా ఉందంటే ఆశ్చర్యపోవాల్సిందే. వయస్సు, తారతమ్యాలు కూడా మరచి, వావి వరసలు చూడక ప్రతినిత్యం ఎక్కడో ఒక చోట అత్యాచారం జరిగిందన్న వార్త మీడియాలో చూసి లేదా చదవని రోజు లేదు. మూడేళ్ల పసిమొగ్గల నుంచి 90ఏళ్ల ముదసళ్ల వదలక ఎక్కడో ఒక చోట అత్యాచారాలకు దిగుతున్నారు. కన్న తండ్రి, అన్నదమ్ములు, ప్రక్కింటి, ఎదురింటి వాళ్లు, ముసలితాతల నుంచి కూడా మానవతికి రక్షణ లేని రోజులివి. చట్టాలు, ప్రభుత్వాలు ఆడపిల్లలకు రక్షణ కల్పించలేవు. తల్లిదండ్రులు మేల్కొనాలి. తమ బిడ్డలను అనుక్షణం కంటికి రెప్పలా కాపాడుకోవాలి. కాలేజి పిల్లలకు ప్రేమల గూర్చిన లాభనష్టాలు, జీవిత విలువల గూర్చి చెప్పండి. ముందు మీరు తల్లి తనాన్ని సంతరించుకోండి. అప్పుడు మీ పిల్లలు మీ మాట వినకుండాపోరు.

సోలా జానకీదేవి — నెల్లూరు

### సింహపురితో భరద్వాజ అనుబంధం!

ప్రతిష్ఠాత్మక జ్ఞానపీఠం పురస్కార గ్రహీత రావూరి భరద్వాజ గారికి మన నెల్లూరుతో గల అనుబంధం జిల్లా సాహితీ చరిత్రలో ఒక సువర్ణాధ్యాయంగా కలకాలం నిల్చిపోతుందనడంలో అతిశయోక్తి లేదు. జిల్లా పత్రికా రాజం 'జమీన్ రైతు'లో ఆయన పని చేసిన కాలం నెల్లూరు పాత్రికేయునిగా వారి అనుభవాల సారం జ.రై పాఠకులు తెలియగోరడం అత్యాశకాదు. మీడియాతో సహ పత్రికల్లో వచ్చిన కథనాలు సమీక్షలు తరహాగా గాక, ఆత్మీయతలు నిండిన వారి తీపి గుర్తుల ప్రత్యేక సింహావలోకనంగా ప్రచురిస్తే బాగుంటుంది.

ఎం.రామమూర్తి — విశాఖపట్నం

### ఇప్పుడు గుర్తొచ్చాయా?

విఠపు బాలసుబ్రహ్మణ్యంగారు శాసన మండలి సభ్యునిగా తన పదవీ కాలం చాలా భాగం పూర్తయిన దశలో విద్యావ్యవస్థ మీద తన భావోద్వేగాలు 'జమీన్ రైతు'లో అకస్మాత్తుగా ప్రకటించడం ఆశ్చర్యకరంగా వుంది. వారికి ఇంతవరకూ సందర్భం రాలేదన్నది అవాస్తమే. ఈ భావ ప్రకటన కూడా ఫ్యూడల్ వ్యవస్థ నుండి బయటకు రాలేక స్వీయరక్షణ అంటూ బడాబడా పదాలను వాడారు. ఇది తప్ప తాను చేసిన పోరాటం ఎక్కడ ఆచరణ సాధ్యం కాలేదో చెప్పక వ్యవస్థ మీద నిందలు మాత్రం బాగానే వేశాడాయన. ఎమ్మెల్సీగా బాలసుబ్రహ్మణ్యం ఒక్క సామాజిక ఉద్యమాన్ని చేపట్టలేదు. డిఇఓ బదలీ ఉద్యమాన్ని నేరుగా బలపరచి విఫలమయ్యారు. ప్రభుత్వ స్కూళ్లు బాలసుబ్రహ్మణ్యంగారు పేర్కొన్నంత ఘోరంగా లేవు. అపార్ట్‌మెంట్లలో నిర్వహిస్తున్న ప్రైవేట్ స్కూళ్లపై ఆయన చేసిన పోరాటం ఏదీలేదు.

ములుమూడి ప్రభాకర్‌రావు — నెల్లూరు

కొరవ 14వ పేజీలో

## 70 ఏళ్ల క్రితం ఈవారం

**21-5-1943**
**పేజీలు : 4 వెల: అణా**

### నెల్లూరు ముచ్చట్లు

### హెడ్మాస్టరెవరు?

ఈ విషయం అందరి హృదయాంతరాళాల్లో తరంగితమౌతున్న ముఖ్య ప్రశ్నే. జడీభూతమైన ఆ తిప్పరాజు వారి గోడ వ్రాసినట్లు వ్యక్తభిమానాలు, వ్యక్తి ద్వేషాలు గాదు మనకు కావలసింది; వేల కొలది విజ్ఞానఖనుల సృష్టించవలసిన సరస్వతీ దేవాలయార్చకాన్వేషణము. యిందు సర్వభేదాలు, తన మన అంతరాలకు చోటులేదు. తాను తరించి విద్యార్థుల తరింపజేయగల తేజోరాశి కావాలె. శ్రీరామయ్యంగారి పేరొకటి సూచింపబడుచున్నది. వీరు దీనికెంతేసి అర్హులో. కానీ అన్న ప్రిన్సిపాల్, తమ్ముడు హెడ్మాస్టరు అయితే అధికార దుర్వినియోగం జరుగుతుందా అనే ఒక్క ఆక్షేపణే ఆలోచనీయాంశం. అది తప్పితే మంచి సెలక్షన్. ఐనా ఆలోచించండబ్బా!

–విమర్శకుడు

### గ్రామ సీమలు

### బాలిరెడ్డిపాళెం కిర్సనాయిలు

ఈ ప్రాంతంలో కిర్సనాయిల్ కరవు విపరీతంగా వుంది. కోట, వాకాడు గ్రామాలకు సప్లయి ఇచ్చినారు. అక్కడ పోతే వారు చేతులు వెల్లకిల వేస్తున్నారు. తాలుకా ప్రభువునడిగితే పైకి వ్రాశాను వస్తుందంటాడు. బీద బిక్కి కూటికేగాక తిళ్లక చమురుకు గూడా ఏడవవలసిందేనా?

### అల్లూరు పేట

రైటింగు వగైరా కాలేజి ప్రిన్సిపాళ్ల తగాదాల వల్ల అందు చదువు పిల్లలు యమయాతన పడుతున్నారు స్వామీ!

–పౌరుడు

## 50 ఏళ్ల క్రితం ఈవారం

**17-5-1963**
**పేజీలు: 12 వెల: 0-20 న.పై**

### నెల్లూరు ముచ్చట్లు

### డాక్టరు గోపాలరెడ్డి

కేంద్ర రేడియో సమాచార శాఖామాత్యులు డాక్టర్ బెజవాడ గోపాలరెడ్డిగారు 23వ తేది ఢిల్లీలో బయలుదేరి కలకత్తా, 25వ తేది బొంబాయి చూచుకొని, 26వ తేది ఉదయం 9.15 గంటలకు హైదరాబాదు వస్తారు. వారు తిరుగా హైదరాబాద్ నుండి 27వ తేది రాత్రి 8.05 గంటలకు బయలుదేరి ఢిల్లీకి పోతారు.

### జిల్లా పరిషత్తు

18వ తేది జరుగు జిల్లా పరిషత్ సమావేశంలో సభ్యత్వం కోల్పోయిన శ్రీమతి విమలా హెబ్బార్ స్థానంలో మరొక మహిళ ఎన్నిక జరుగుతుంది. నెల్లూరు ఆర్‌ఎస్‌ఆర్ హైస్కూల్ మాజీ హెడ్మాస్టరు శ్రీ విజయం గారి సతీమణి ఈ స్థానానికి ఎన్నుకో బడవచ్చునని తెలుస్తున్నది. ఈమె పేరుగానీ, ప్రజాసేవారంగంలో ఆమె పాత్రను గూర్చి గానీ మేము యిం తకు ముందు వినలేదు.

### చక్కెర : కొండయ్య ప్రకటన

చక్కెర కంట్రోలు, పంపకం విషయంలో అనుసరించదగు పద్ధతులను గూర్చి తాను జిల్లా కలెక్టరు, ఆర్‌డిఓ గార్లను కలుసుకొని చేసిన సూచనలను వివరిస్తూ, నెల్లూరు శాసనసభ్యుడు జి.సి.కొండయ్య; చిల్లర వ్యాపారస్తులను యుద్ధ ఫండు కట్టమనడం అసమంజసమని, అడగడం, యిచ్చిన వారి నుండి తీసుకోవడం, గతంలో యిచ్చిన రశీదులు చూపిస్తే ఒప్పుకోవడం ఏదో ఒక పద్ధతి ఉండాలని, అత్యవసరమైన చక్కెర పంపకానికి దీనినడ్డం పెట్టడం అత్యవసర పరిస్థితిని సరిగా అర్థం చేసుకోకపోవడమేనన్నారు.

# నెల్లూరు ముచ్చట్లు

## అదరగొడుతున్న ఎండ

నెల్లూరీయులను భానుడు బెదర గొట్టేస్తున్నాడు. గతంలో ఎన్నడూలేని విధంగా చంద్రనిప్పులు కురిపిస్తున్నాడు. 10వ తేది ఆల్ టైం ఎండ హై రికార్డు స్థాయి 45 డిగ్రీలకు చేరుకొంది. ఉదయం 10 గంటల నుంచి సాయంత్రం ఐదు గంటలవరకు అదరగొట్టేస్తున్న ఎండకు జనం ఇళ్లలో నుంచి బయటకు రావడం లేదు. మంచి ఎండ సమయంలో విద్యుత్ కోత జనాలను ఇంకాస్త ఇబ్బంది పెట్టేస్తుంది. 13, 14 తేదీల్లో బంగాళాఖాతంలో వాయుగుండం మూలంగా ఎండ తీవ్రత కాస్త తగ్గినా ఉబ్బ మాత్రం జనాన్ని ఉక్కిరి బిక్కిరి చేసింది. మే నెల చివరి వారానికి ఎండ ఏ స్థాయిలో ఉంటుందో ఇప్పుడే ఊహించడం కష్టమేననక తప్పదు. ఇది ఇలా ఉండగా 14వ తేది రాత్రి నెల్లూరు చెరువు ప్రాంతంలో మంచు దుప్పటి కనపడడం గందరగోళ వాతావరణానికి సంకేతంగా నిలిచింది.

## వివేకా వచ్చాడు!

అస్వస్థతకు గురయ్యి ఆరు నెలల పాటు హైదరాబాద్‌లో ఉండి చికిత్స చేయించుకున్న నెల్లూరు రూరల్ ఎమ్మెల్యే ఆనం వివేకానందరెడ్డి 13వ తేది ఉదయం ఛార్మినార్ ఎక్స్‌ప్రెస్‌లో నెల్లూరు వచ్చాడు. అభిమానుల సాదర స్వాగతం నడుమ ఎసి సెంటర్‌కు చేరుకొన్న ఆయన అక్కడి వినాయకుడి గుడిలో ప్రత్యేక పూజ చేయించాడు. అనంతరం నెల్లూరు నగర దేవత ఇరుగాళమ్మ, మూలస్థానేశ్వర స్వామి, సుబ్రహ్మణ్య స్వామిల దర్శనాంతరం ఎసి సెంటర్ లోని తన ఇంటికి చేరాడు. వివేకాను పరామర్శించను ఆయన అభిమానులు 'క్యూ' కట్టారు.

## కేంద్రంలోనూ రాష్ట్రంలోనూ గెలుస్తాం!

రాబోయే పార్లమెంట్, అసెంబ్లీ ఎన్నికల్లో కాంగ్రెస్ పార్టీ గెలిచి అధికారం చేపట్టడం ఖాయమని తిరుపతి ఎమ్పీ చింతామోహన్ స్పష్టం చేశారు. 11వ తేది నెల్లూరు వచ్చిన ఆయన విలేకరులతో పిచ్చాపాటీగా మాట్లాడుతూ ఈ విషయాన్ని చెప్పారు. ప్రస్తుతానికి కేంద్రంలోనూ రాష్ట్రంలోనూ ఎదుర్కొంటున్న అవాంతరాలన్నింటినీ పార్టీ అధిగమిస్తుందన్న ఆశాభావాన్ని వ్యక్తం చేశారు.

## జర్నలిస్టుల రచ్చ!

ఎలక్ట్రానిక్ మీడియా విస్ఫోటనం మూలంగా నాలుగు అక్షరాలు కూడా వ్రాయలేని వాళ్ల మీడియాగా చలామణి అయిపోతున్న రోజులివి. పూర్వం జర్నలిస్టులంటే సమాజంలో ఎంతో విలువ, గౌరవం ఉండేది. నేడది మరీ పలుచన అయిపోతున్నది. 11వ తేది కలెక్టరేట్‌లో ఎమ్పీ చింతామోహన్ ప్రెస్ మీట్ సందర్భంగా ఇద్దరు జర్నలిస్టుల మధ్య రేగిన చిన్న స్పర్థ చిలికి చిలికి గాలివానగా మారింది. పరిస్థితి ఎక్కడకు వెళ్తుందోనని ఊహించి భయపడ్డ ఎజెసి, డిఆర్వోలతో సహా పది మంది జిల్లా అధికారులు భోంచేస్తున్న ప్లేట్లు పడేసి పరుగెత్తారు. జర్నలిస్టుల్లో ఎక్కువ తక్కువన్నది వారి కలం బలం, వ్యవహారశైలి వల్లే తెలుస్తుందని మీడియా మిత్రులు తెలుసుకోవాలి. లేకుంటే పాత్రికేయుల పరువు పెన్నానది పాలవుతుంది.

## షార్ శాస్త్రజ్ఞులపై విమర్శ!

శ్రీహరికోటలోని షార్ కేంద్రంలో పనిచేసే శాస్త్రజ్ఞుల్లో అవినీతిపరులున్నారని తిరుపతి ఎమ్పీ డాక్టర్ చింతామోహన్ చెప్పడం సంచలనం రేకెత్తించింది. కృష్ణపట్నం, శ్రీహరికోటకు సమీపంలోనే ఎల్అండ్‌టి ప్రతిపాదించిన ఓడరేవులకు నిరభ్యంతరంగా అనుమతి పత్రాలిచ్చిన షార్ శాస్త్రజ్ఞులు ముందు కావాలనే దుగరాజపట్నం ఓడరేవు పట్ల అభ్యంతరాలు వ్యక్తం చేశారని, కేంద్రంలోని పెద్ద నాయకులు గట్టిగా మాట్లాడిన తర్వాత వారు తమ అభ్యంతరాలను వెనక్కు తీసుకోవడంతో తాను ఆశ్చర్యపోయినట్లు చింతా స్పష్టం చేశారు.

## ఇదేం పని రంగన్నా!

డైరీ ఛైర్మన్‌గా నెల్లూరు నగరంలో మరిన్ని విజయ పాలు అమ్మే అవుట్ లెట్స్ ఏర్పాటు చేయాల్సింది పోయి సుబేదారుపేటలో ఎప్పటి నుంచో డైరీ నేతృత్వంలో నడుస్తుండిన అవుట్ లెట్‌ను తన స్వంత మనిషికి కొండ్రెడ్డి రంగారెడ్డి అప్పగించడం విమర్శకు తావిచ్చింది. సుబేదారుపేటలోని విజయ పాల అమ్మకం కేంద్రంలో వ్యాపారం బాగా జరుగుతుంది. దాన్ని సాక్షాత్తు ఛైర్మన్‌నే పరుల పరం చేయడం భావ్యమా?

## ఇన్‌ఛార్జ్ ఎఎస్పీగా ఐఆర్ఎస్ మూర్తి!

నెల్లూరు ఇన్‌ఛార్జ్ ఎఎస్పీగా ఐఆర్ఎస్ మూర్తి 10వ తేది బాధ్యతలు తీసుకొన్నారు. ఈయన ప్రస్తుతం ఎఆర్ ఎఎస్పీగా పనిచేస్తున్నారు. ఇక్కడ లా అండ్ ఆర్డర్ ఎఎస్పీగా పనిచేస్తుండిన ఎల్‌టి.చంద్రశేఖర్ హైదరాబాద్ ఈస్ట్ జోన్ డిసిపిగా బదలీ కావడంతో ఆ బాధ్యతలు మూర్తికి అప్పజెప్పారు. పాత ఎఎస్పీ ఎల్‌టి చంద్రశేఖర్ చాలా బాధ్యతాయుతంగా నెల్లూరులో పని చేశారు. మూర్తి కూడా అదే బాటలో సాగి మంచిపేరు తెచ్చుకోవాల్సి వుంది.

## బుడిగి మూడో పెళ్లి!

ఇండియన్ ఫారెస్ట్ సర్వీసు అధికారిగా ఇటీవలే నియక్తుడైన బుడిగి శ్రీనివాసులురెడ్డి మూడో పెళ్లికి సిద్ధపడడం దాన్ని మీడియా బట్టబయలు చేయడం విశేషంగా చెప్పుకోవచ్చు. ఇటీవల వరకు నెల్లూరులోనే ట్రైనింగ్ అయిన కళ్లులేని ఈ అధికారిని అందరూ తెగమెచ్చుకొన్నారు. కానీ ఈయన 2001 సంవత్సరంలో కలువాయి మండలం తోపుగుంటలో మొదటి పెళ్లి చేసుకొన్నాడట. 2006లో కడపలో రెండో పెళ్లి చేసుకొని, ముచ్చటగా మూడో పెళ్లిని నెల్లూరు రూరల్ మండలం కొండ్లపూడిలో చేసుకొన్నాడు. నా పెళ్లి నా యిష్టం అంటున్న ఈ అధికారికి ఉద్యోగం ఇచ్చే సమయంలో వ్యక్తిగత వివరాలు విచారణ చేసినట్లు లేదు. బుడిగి శ్రీనివాసులురెడ్డిపై భూ ఆక్రమణల ఆరోపణలున్నాయి. వీటన్నింటిపై విచారణకు కేంద్ర ప్రభుత్వం ఆదేశించాల్సి వుంది.

## కోర్టుకెక్కిన డిఎస్పీ!

గూడూరు పాత డిఎస్పీ టి.వి.హనుమంతరావు తన బదలీ అక్రమమంటూ రాష్ట్ర పరిపాలనా ట్రిబ్యునల్‌ను ఆశ్రయించారు. బాధ్యతలు స్వీకరించిన నాలుగు నెలల్లోనే తన బదలీ అన్యాయమని డిఎస్పీ కోర్టుకెక్కడం నెల్లూరు పోలీసు చరిత్రలో మొదటిసారి అంటున్నారు. డిఎస్పీ హనుమంతరావు వ్యవహారాన్ని డిజిపి దినేష్‌రెడ్డి చూసుకొంటారని ఎస్పీ రమణకుమార్ స్పష్టం చేశారు.




**కర్ణాటక ముఖ్యమంత్రిగా సిద్ధరామయ్య ప్రమాణ స్వీకారోత్సవాన్ని పురస్కరించుకొని ఇందిరా భవన్‌లో సందడి చేస్తున్న ఉడత వెంకట్రావు, రఘురామ్, పందిళ్లపల్లి అరుణమ్మ తదితరులు.**

## కళ్యాణ వైభోగం!

12వ తేది మంచి ముహూర్తమంటూ నెల్లూరులో వందలాది జంటలు పెళ్లితో ఒక్కటయ్యారు. కళ్యాణ మండపాలు, దేవాలయాలు, సత్రాలు సరిపోక ఇళ్ల ముంగిట పాత తరహాలో పందిళ్లు వేసి మూడుముళ్ల కార్యక్రమం గావించారు. ఆ రోజు ఎండ తీవ్రత ఎక్కువగా ఉండడంతో పెళ్లిళ్లకు హాజరు కావాల్సిన వాళ్లు అల్లాడి పోయారు.

## మందులంగళ్ల మూత!

ఆల్ ఇండియా ఆర్గనైజేషన్ ఆఫ్ కెమిస్ట్ అండ్ డ్రగ్గిస్ట్ సంఘం పిలుపు మేరకు దేశవ్యాప్త ఆందోళనలో భాగంగా 10వ తేది నెల్లూరు నగరంలోని మందుల దుకాణాలు మూసివేశారు. బహుళ జాతి వ్యాపార సంస్థలకు మందుల అమ్మకాల బాధ్యతలు అప్పజెప్పవద్దని ఫార్మాసిస్టుల సమస్యలు పరిష్కరించాలని

కొరవ 14వ పేజీలో

# దుగరాజపట్నం పోర్టును సాధించా!

## • లక్షలాది మందికి మేలు చేకూరుతుందన్న చింతా

విలేకరుల సమావేశంలో మాట్లాడుతున్న చింతా మోహన్.

ప్రపంచ పారిశ్రామిక పటంలో జిల్లా పేరు కనిపించాలనే తపనతో ప్రధాని మన్మోహన్‌సింగ్‌తో ఒకటికి వంద సార్లు మాట్లాడి దుగరాజపట్నం పోర్టును సాధించినట్లు తిరుపతి ఎమ్పీ చింతా మోహన్ చెప్పారు. 11వ తేది కలక్టరేట్ ప్రాంగణంలోని డిఆర్‌డిఏ మీటింగ్ హాల్‌లో విలేకరులతో మాట్లాడారు. నెల్లూరు జిల్లా చాలా సంపన్నమైన జిల్లా. పంజాబ్‌కన్నా నెల్లూరు జిల్లా రైతులు ఎప్పుడో వ్యవసాయపరంగా ముందడుగు వేశారు. కానీ పారిశ్రామిక పరంగా జిల్లా ఎన్నో ఏళ్లుగా వెనుకబడి పోయింది. మైకా మైన్లు, చక్కెర ఫ్యాక్టరీలు, ఈ మధ్యే వచ్చిన ఎస్ఇజడ్‌లు జిల్లాను ఆర్థికపరంగా ఆదుకోలేదు. అందుకే కేంద్ర ప్రభుత్వంతో మాట్లాడి ఏదో ఒక ప్రాజెక్ట్ సాధించాలని చాలాసార్లు ప్రధాని మన్మోహన్‌సింగ్‌ను కలిశా. ఆయన నువ్వే ఏదో ఒక ఆలోచన, ప్రతిపాదనతో రమ్మన్నారు. దీంతో 15వ శతాబ్దంలోనే ఓడరేవుగా గుర్తింపు పొందిన దుగరాజపట్నం పోర్టు ప్రతిపాదనను ఆయన ముందు ఉంచాను. పలు కమిటీల పరిశీలనల అనంతరం 9వ తేది జరిగిన కేంద్ర క్యాబినెట్ భేటీలో దుగరాజపట్నంలో పోర్టు నిర్మాణానికి 25 మంది మంత్రులు ఏకగ్రీవంగా ఆమోదించడంతోపాటు రాష్ట్రపతి ఆమోదముద్రకు కూడా పంపినట్లు చెప్పారు. ఈ పోర్టు ఏర్పాటుకు 8వేల కోట్ల రూపాయల ప్రతిపాదనను సిద్ధం చేసినా పూర్తయ్యే నాటికి 25వేల కోట్ల రూపాయలు ఖర్చు కావచ్చని చింతా మోహన్ స్పష్టం చేశారు. ఈ ఏడాదిలోనే పోర్టు పనుల ప్రారంభానికి శంకుస్థాపన రాయి పడుతుందన్నారు. పోర్టు గతి విధులతో జిల్లాలో 500 పెద్ద పరిశ్రమలు ఏర్పాటయ్యి పది లక్షల మందికి ఉద్యోగాలు వస్తాయని, ప్రతి రైతు కోటీశ్వరుడవుతాడు. నిరుపేద లక్షాధికారి అవుతాడన్న ఆశాభావాన్ని ఎమ్పీ వ్యక్తం చేశారు. పోర్టు ఏర్పాటుకు అవసరమైన భూములు ప్రభుత్వానివే ఈ ప్రాంతంలో అందుబాటులో ఉన్నాయన్నారు. పోర్టుకు అనుమతి మంజూరు చేసిన ప్రధాని మన్మోహన్‌సింగ్, యుపిఏ ఛైర్‌పర్సన్ సోనియాగాంధీకి కృతజ్ఞతలు తెలియజేశారు. ఈ సమావేశంలో పాత్రికేయుడు మధు, ఉడతా వెంకట్రావ్, రఘురామ్ తదితరులు పాల్గొన్నారు.

# ఆ అపార్ట్‌మెంట్‌ను ఏంచేస్తారు?

నెల్లూరు కార్పొరేషన్ టౌన్ ప్లానింగ్ విభాగంలోని బిల్డింగ్ ఇన్స్‌పెక్టర్ మధు, అటెండర్లు బాబూరావు, శ్రీనివాసులు రెడ్డిలను లంచం తీసుకొంటుండగా ఎసిబి రెడ్ హ్యాండెడ్‌గా పట్టుకొంది. ఎసిబి కోర్టుల్లో నిందితులు మూడు సార్లు బెయిల్ పిటిషన్లు పెట్టినా తిరస్కరించింది. ఈ తతంగానికి కారణం వేదాయపాళెంలోని బిల్డర్ తన ఇష్టప్రకారం కట్టిన అపార్ట్‌మెంట్. దీన్ని చట్టబద్ధం చేసేందుకు మూడున్నర లక్షల రూపాయలు లంచాన్ని టౌన్ ప్లానింగ్ అధికారులు అడిగారు. బిల్డర్ ఎసిబి దగ్గరకు వెళ్లి ఉద్యోగులను పట్టించాడు మంచిదే. మరి బిల్డర్ కట్టిన అక్రమ కట్టడం పరిస్థితి ఏమిటి? ఈ అపార్ట్‌మెంట్‌ను కార్పొరేషన్ వారు పగుల గొడతారా? భారీ జరిమానా విధించి రాజకీయ సిఫార్సులతో ముందుకు వెళ్లిపోతారా అనే ప్రశ్నలు పలువురు పౌరుల

**వార్తల్లో వేదాయపాళెం అపార్ట్‌మెంట్!**

మదిలో మెదలుతున్నాయి. నగరంలో ప్రస్తుతం కడుతున్న బిల్డింగుల్లో అనుమతి పొంది, ప్లాను ప్రకారం కట్టినవి పది శాతమే అన్నది వాస్తవం. ఈ వ్యవహారాన్ని విజిలెన్స్ అండ్ ఎన్‌ఫోర్స్‌మెంట్ శాఖ లోతు విచారణ చేస్తే ఎన్నో విషయాలు బయటపడతాయి.

# నెల్లూరోళ్ల సీరియల్‌కు మూడు అవార్డులు!

## • మల్లెమాల కుటుంబం ఘనత

జయంపు కృష్ణకు అవార్డు అందజేస్తున్న సుమన్, రాష్ట్ర మంత్రి పితాని సత్యనారాయణ.

నెల్లూరీయుడు, ప్రఖ్యాత సినీ నిర్మాత మల్లెమాల శ్యాంప్రసాద్‌రెడ్డి మల్లెమాల సంస్థ పతాకాన నిర్మించి ఈ-టీవీలో డైలీ సీరియల్‌గా రాత్రి 7.30 గంటలకు ప్రసారం చేస్తున్న 'మనసు మమత'కు ముచ్చటగా మూడోసారి బహుమతి వచ్చింది. పలు మలుపులతో ఉత్కంఠభరితంగా కొనసాగుతున్న ఈ సీరియల్ ఇప్పటికి 700లకు పైగా ఎపిసోడ్లను దాటి ముందుకెళ్తుంది. మొదటిసారి శాసనమండలి ఛైర్మన్ డాక్టర్ చక్రపాణి, రెండోసారి జ్ఞానపీఠ్ అవార్డు గ్రహీత డాక్టర్ సి.నారాయణరెడ్డి, మూడవసారి సినీనటుడు హీరో సుమన్ చేతులమీదుగా హైదరాబాద్‌లోని రవీంద్రభారతిలో స్క్రిప్ట్ కో ఆర్డినేటర్ జయంపు కృష్ణ అవార్డు అందుకొన్నారు. త్వరలో జరిగే ప్రభుత్వ నంది అవార్డుల ప్రదానోత్సవంలో ఉత్తమ దర్శకునిగా ఈ సీరియల్ దర్శకుడు అనిల్ కుమార్, నటునిగా శుభలేక సుధాకర్ నందులు అందుకోబోతున్నారు. శ్యాంప్రసాద్‌రెడ్డి కుమార్తె శ్రీమతి దీప్తిరెడ్డి నిర్మించి ఈ-టీవీలో ప్రసారమైన 'అదుర్స్' కార్యక్రమానికిగాను నంది అవార్డు అందుకోబోతున్నారు.

# కప్పరాళ్లతిప్ప దొంగలపై ఎప్పుడో దాడి చేయాల్సింది!

## తమదాకా వస్తేకానీ కదలని పోలీసులు

తమ దాకా వస్తే కానీ నొప్పి తెలియదన్నట్లుంది పోలీసుల వ్యవహారశైలి. జాతీయ రహదారిపై దొంగతనాలు, దోపిడీలు గత కొంతకాలంగా అధికంగా జరుగుతున్నాయి. రాత్రి సమయాల్లో రహదారిపై ప్రయాణించే లారీలు, ఇతర వాహనాల వారిని అటకాయించి దోపిడీకి పాల్పడే ముఠాలు పెట్రేగి పోతున్నాయి. దీనిపై బాధితులు సమీప పోలీస్ స్టేషన్‌కు వెళ్లి ఫిర్యాదులు చేస్తున్నా తమ సహజ సిద్ధమైన ధోరణిలో వ్యవహరిస్తున్నారు పోలీసులు. ఇటీవల కావలి డిఎస్పీ ఇందిర గన్‌మెన్‌లపైనే ఏకంగా దొంగలు దాడికి దిగడంతో పోలీస్ శాఖ పరువు జాతీయ రహదారి పాలైంది. తమపైనే దాడికి తెగబడతారా అని ఆగ్రహించిన పోలీసులు దొంగలకు, దోపిడీదారులకు, నేరస్తులకు స్థావరాలుగా చెప్పబడే కప్పరాళ్లతిప్ప, కల్లూరుపల్లి తదితర ప్రాంతాలలో మెరుపు దాడులు చేయడం సంచలనం కల్గించింది. పొద్దునే 4.30 గంటలకల్లా వివిధ స్టేషన్ల సబ్ ఇన్స్‌పెక్టర్లు, సిఐలు, పోలీసులు, డిఎస్పీ ఇందిర ఆధ్వర్యంలో అధికసంఖ్యలో ఆయా ప్రాంతాల్లోకి వచ్చి ఇంటింటికి వెళ్లి సోదాలు జరపడంతో ఏమి జరిగింది? ఏమి జరగబోతుందన్న ఆందోళన వ్యక్తమయింది ఆ ప్రాంతాల్లో. చివరకు కొండను త్రవ్వి ఎలుకను పట్టుకొన్న చందంగా దొంగిలించబడిన ద్విచక్రవాహనాలను స్వాధీనం చేసుకొని, కొంతమంది అనుమానితులను అరెస్టు చేశారు పోలీసులు. అసలు ఇంత పెద్ద ఎత్తున మెరుపు దాడులు ఎందుకు చేశారు? పేరుమోసిన దొంగలు ఈ దాడుల్లో దొరికారా? ప్రజలకు రక్షణ కల్పించడానికో లేక తమ శాఖ పరువు నిలుపుకోవడానికో ఈ దాడులు చేశారా అన్నది ప్రజల నుంచి ఎదురౌతున్న ప్రశ్నలు.

## • టిటిడి

# ధర్మ ప్రచార మండలి!

## బాధ్యతలు తీసుకొంది

తిరుమల తిరుపతి దేవస్థానం జిల్లా ధర్మ ప్రచార మండలి ప్రమాణ స్వీకార కార్యక్రమం నెల్లూరు టిటిడి కళ్యాణ మండపంలో ధర్మ ప్రచార పరిషత్ స్పెషల్ ఆఫీసర్ ఎస్.రఘునాథ్ సమక్షంలో జరిగింది. ఈ మండలికి అధ్యక్షులుగా సి.వి.సుబ్రహ్మణ్యం, ఉపాధ్యక్షులుగా కొండా శేఖర్‌రెడ్డి, కార్యదర్శిగా ధనుంజయ ప్రమాణ స్వీకారం చేశారు. ఈ కార్యవర్గం 2013 నుండి 2016 వరకుంటుంది. హిందూ ధర్మ పరిరక్షణ, హిందూ ధర్మ ప్రచారం, ఆధ్యాత్మిక విషయ పరిజ్ఞాన ప్రచారాన్ని ఈ మండలి చేస్తుంది.

# ట్రాఫిక్ సమస్య... తీరేదెట్లా?

## పద్మవ్యూహంలో నెల్లూరు పౌరులు

నగరంలో ట్రాఫిక్ సమస్య నానాటికీ అధికమవుతోందే తప్ప తగ్గే సూచనలు కన్పించడం లేదు. ఒకవైపు రోడ్లు విస్తరణ పనులు చేపడుతున్నా, మరోవైపు రోడ్లు కుచించుకుపోతుండడంతో రోడ్ల విస్తరణ జరుగుతున్నప్పటికీ ఉపయోగం లేకుండా పోయింది. ఇక ప్రధాన మార్గాలలో ట్రాఫిక్ జఠిలంగా మారుతోంది. మాగుంట విగ్రహం వద్ద నుంచి బోసుబొమ్మ వరకు నిత్యం ట్రాఫిక్ సమస్య ఎదురౌతోంది. ఎక్కడికక్కడ వాహనాలు నిలిచి పోతున్నాయి. మహా నగరాల్లో మాదిరిగా నగరంలోనూ ట్రాఫిక్‌లో వాహనాలు చిక్కుక పోతుండడంతో మరోవైపు ఎండ వేడిమి కారణంగా వాహనాలు నడిపేవారు అల్లాడి పోతున్నారు. దీనికి తోడు పెద్ద పెద్ద వ్యాపార సంస్థలు రోడ్లపైనే పార్కింగ్‌కు వదలడంతో రాకపోకలకు తీవ్ర అంతరాయం ఏర్పడుతోంది. చివరకు విఆర్‌సి వద్ద నుంచి గాంధీబొమ్మ వరకు వున్న డివైడర్ల మధ్య నుంచి రోడ్డు దాటాలంటే పాదచారులు సర్కస్ ఫీట్లు చేయాల్సి వస్తుండడంతో ప్రజలు పడుతున్న బాధలు వర్ణనాతీతం. పోలీసులు ట్రాఫిక్ సమస్యను చక్కబెట్టేందుకు అప్పుడప్పుడు దడబడలు సృష్టిస్తున్నా ఫలితం శూన్యం. పశువులు రోడ్లపైకి వచ్చేస్తుండడం, తోపుడు బండ్ల వ్యాపారులు రోడ్లపైనే తమ వ్యాపారాలు నిర్వహిస్తుండడం, ఆటోలు, టౌన్ బస్సులు విచ్చలవిడిగా ఎక్కడంటే అక్కడ నిలుపుదల చేస్తుండడం సర్వసాధారణమైంది. పోలీసు అధికారులు ఇప్పటికి పలుమార్లు నగరంలో ట్రాఫిక్ సమస్య చక్కబెట్టడానికి వివిధ ప్లానులు వేసినా, నిపుణులను రప్పించి పరిష్కారానికి చర్యలు చేపట్టినా అవి అటకెక్కుతున్నాయి తప్ప ఫలితమివ్వడం లేదు. మరోవైపు తానేమీ తక్కువ కాదన్నట్లు సిటీ ఎమ్మెల్యే ముంగమూరు శ్రీధర్‌కృష్ణారెడ్డి ఇటీవల నగరంలో ట్రాఫిక్‌పై వివిధ ప్రాంతాల్లో పర్యటించి పోలీసు అధికారులకు పలు సూచనలు చేశారు.

## • వినియోగదారులకు

# ఫోరం అండా దండా!

## మంచి తీర్పులే ఇస్తుంది

వ్యాపారాభివృద్ధికి వివిధ సంస్థలు ఆర్భాటపు ప్రకటనలు చేయడం, వినియోగదారులను మభ్యపెట్టి మస్కా కొట్టి ఎలాగోలా అమ్మకాలు చేపట్టి జేబులు నింపుకొనే వారి సంఖ్య అధికమవుతుంది. వివిధ వ్యాపార సంస్థల వద్ద వస్తువులు కొన్న వినియోగదారుడు మరమ్మత్తులకు గురైనపుడు, ఇన్సూరెన్సులాంటి సంస్థల నుంచి తమకు రావాల్సిన సొమ్ము రానపుడు అండగా నిలబడి వినియోగదారుల హక్కులు, ప్రయోజనాలు కాపాడడంలో ఫోరం వ్యవహరిస్తున్న తీరు మన్ననలు అందుకొంటుంది. ఇటీవల జిల్లా వినియోగదారుల ఫోరం తమ దృష్టికి వచ్చిన ఫిర్యాదులపై స్పందించి ఆయా వ్యాపార సంస్థలు, బీమా సంస్థలకు మొట్టికాయలు వేసి వినియోగదారుడికి కల్గిన నష్టానికి వడ్డీతో సహా తిరిగి చెల్లించాలని ఇటీవల పలు కేసులలో తీర్పులివ్వడం ప్రాధాన్యత సంతరించుకొంది. ఒక ఫర్నీచర్ షాపు వద్ద 25వేల రూపాయలు ఖర్చుచేసి కొన్న ఫర్నీచర్ విరిగిపోతే యాజమాన్యం సరిగా స్పందించనపుడు, బీమా కంపెనీ నిర్లక్ష్యంగా వ్యవహరించడంపై ఫోరం తీవ్రంగా స్పందించింది. ఇటీవల కొంత కాలంగా వినియోగదారులకు న్యాయం జరిగేలా జిల్లా వినియోగదారుల ఫోరం ఇచ్చిన, ఇస్తున్న తీర్పులు కొంతమేర వినియోగదారులకు మనో ధైర్యానిస్తున్నాయి.

# జొన్నపంట వేయండి!

## రైతులకు ఆత్మ ప్రాజెక్ట్ డైరెక్టర్ సలహా

రైతులు సాగునీటి సమస్యను అధిగమించేందుకు జొన్న, సజ్జలాంటి ప్రత్యామ్నాయ పంటలు సాగు చేయాలని జిల్లా ఆత్మ ప్రాజెక్టు డైరెక్టర్ బి.జి. రాజులు సూచించారు. ఇటీవల ఆయన వెంకటగిరి మండలంలోని కూర్జాగుంట, మన్నెగుంట తదితర గ్రామాల్లో పర్యటించిన ఆయన అక్కడి రైతులతో ముచ్చటించారు. ఈ సందర్భంగా ఆయన రైతులకు పలు సూచనలు చేశారు. జిల్లాలో సాగునీటి సమస్య కారణంగా రైతులు వ్యవసాయానికి నీరు అందక ఇబ్బందులు పడుతున్నారన్నారు. దీనిని దృష్టిలో వుంచుకొని రైతులు వరికి బదులు సజ్జ, జొన్నలాంటి నీటి ఎద్దడిని తట్టుకొనే పంటలు సాగు చేయాలన్నారు. ఈ పంటలు వేయడం వలన పెట్టుబడులు తగ్గడంతోపాటు, అధిక దిగుబడులు సాధించవచ్చన్నారు. రైతులకు వ్యవసాయ సాంకేతిక పథకం ద్వారా తక్కువ పెట్టుబడితో అధిక దిగుబడులు సాధించే అంశంపై శిక్షణా తరగతులు నిర్వహిస్తున్నామన్నారు. విత్తనశుద్ధి పథకం క్రింద రైతులు తమకు అవసరమయ్యే విత్తనాలను స్వయంగా తయారు చేసుకోవచ్చన్నారు.

# ఎరువుల వాడకం తగ్గించాలి!

## తోటపల్లి గూడూరు వ్యవసాయాధికారి

పంటల సాగులో రసాయనిక ఎరువుల వాడకాన్ని తగ్గించాలని తోటపల్లిగూడూరు మండల వ్యవసాయాధికారి జ్యోత్స్నా రాణి రైతులకు సూచించారు. రైతు చైతన్యయాత్రల్లో భాగంగా మండలపరిధిలోని పోట్లపూడి, విలుకానిపల్లి గ్రామాలలో జరిగిన కార్యక్రమంలో ఆమె పాల్గొని పంటలసాగుపై రైతులతో సమావేశమయ్యారు. పంటలసాగులో రైతులు క్రిమిసంహారానికి సేంద్రియ ఎరువులు, వేప ఆధారిత పురుగు మందులను మాత్రమే వినియోగించాలన్నారు. ఇవి వాడినా ఫలితం కన్పించనపుడే రసాయనిక పురుగు మందులను వాడాలని సలహా ఇచ్చారు. మందులు పిచికారి చేసే సమయంలో గాలి వాటాన్ని దృష్టిలో వుంచుకొని చల్లాలన్నారు. రైతులు పిచికారి చేసేటప్పుడు చేతులకు గ్లౌజులు, ముఖానికి మాస్కులు ధరించాలన్నారు. పురుగు మందులను కొనుగోలు చేసే సమయంలో చెల్లుబాటు అయ్యే తేదిని గమనించాలన్నారు.



మాజీ మంత్రి సోమిరెడ్డి చంద్రమోహన్‌రెడ్డి కుమారుడు రాజగోపాల్, శృతిల వివాహం 12వ తేది శంషాబాద్‌లోని ఎస్ఎస్ కన్వెన్షన్‌లో జరిగిన సందర్భంగా నూతన వధూవరులతో ఆర్థిక మంత్రి ఆనం రామనారాయణరెడ్డి, మాజీ మంత్రి కె.ఇ.కృష్ణమూర్తి.

# గూడూరు కోనేర్లకు మోక్షం!

- సబ్ కలెక్టర్, మునిసిపల్ కమిషనర్ చొరవతో కొత్త రూపు

చాలాకాలంగా నిరుపయోగంగా వున్న గూడూరులోని శ్రీ వెంకటేశ్వరస్వామి, కోదండరామస్వామి దేవస్థానాలకు సంబంధించిన కోనేర్లకు ఎట్టకేలకు మోక్షం లభించింది. వీటి ఆలనాపాలనా లేకపోవడం, ఎవరూ బాగోగులు పట్టించుకోకపోవడంతో ఆక్రమణదారుల చెరచిక్కాయి. చాలాభాగం రూపురేఖలు కోల్పోయాయి. స్థానికులు ఈ ఆక్రమణలు, కోనేరుల దుస్థితిపై సబ్‌కలెక్టర్ నివాస్, గూడూరు మున్సిపల్ కమిషనర్ సుశీలమ్మ దృష్టికి తీసుకొని వచ్చారు. వారు చొరవ చూపి ఆ రెండు కోనేర్ల ఆక్రమణలపై చర్యలు చేపట్టారు. ఆక్రమణలను పూర్తిగా తొలగించడంతో ఉనికిని కోల్పోయి వున్న కోనేర్లకు తిరిగి రూపు లభించింది. ఈ నేపథ్యంలో స్థానికుడైన కనుమూరు హరిశ్చంద్రారెడ్డి తన ట్రస్టు ద్వారా 60లక్షల రూపాయలు వెచ్చించి శ్రీకోదండరామస్వామి కోనేరును అభివృద్ధి పరచగా, కృష్ణపట్నం పోర్టు యాజమాన్యం కోటి రూపాయలతో శ్రీప్రసన్న వెంకటేశ్వరస్వామి కోనేరు అభివృద్ధికి చర్యలు చేపట్టడంతో గత కొంతకాలంగా దీనావస్థలో వున్న రెండు కోనేర్లకు మంచి రోజులు లభించినట్లయ్యింది. ఈ కోనేరుల అభివృద్ధికి అధికారులు చూపిన చొరవను స్థానికులు అభినందిస్తున్నప్పటికీ ఆక్రమణ తొలగింపులో పక్షపాతం వ్యవహరించారనే ఆరోపణలు వస్తున్నాయి. వెంకటేశ్వరస్వామి కోనేరుకు ఒకవైపున పేదలు గుడిసెలు వేసుకొని వుంటే వాటిని తొలగించిన అధికారులు మిగతావైపుల బడా వ్యాపారస్తులు నిర్మించుకొన్న భవంతుల విషయంలో చూసీచూడనట్లు వ్యవహరిస్తున్నారని విమర్శలు వస్తున్నాయి. దీనికి అధికారులు ఏమి సమాధానం చెప్తారో?

# ఓటరు జాబితాల సవరణ పకడ్బందీగా ఉండాలి!

## కలువాయి తహశీల్దార్ సూచన

ఓటరు జాబితా సవరణలను పకడ్బందీగా చేపట్టాలని కలువాయి తహశీల్దార్ ఎస్ఎండి హుస్సేన్ సిబ్బందికి సూచించారు. మే 16 నుండి చేపట్టిన కొత్త ఓటర్ల మార్పులు, చేర్పుల ప్రక్రియను సమర్ధవంతంగా నిర్వహించాలన్నారు. ఈ కార్యక్రమం అమలుపై మండల కార్యాలయంలో బూత్‌స్థాయి అధికారులకు శిక్షణా కార్యక్రమం నిర్వహించారు. ఈ సందర్భంగా తహశీల్దార్ సిబ్బందికి పలు అంశాలపై విశదీకరించారు. ఓటు హక్కు కోసం కొత్తగా దరఖాస్తు చేసుకొన్న వారి పేర్లను నమోదు చేసుకోవాలన్నారు. అందుకోసం ఇంటింటికి తిరిగి జాబితా తయారు చేయాలన్నారు. జూన్ 16 వరకు జరిగే ఈ కార్యక్రమాన్ని ఎలాంటి అవకతవకలకు తావు లేకుండా నిర్వహించాలన్నారు. పూర్తి చేసిన జాబితాను జూన్ 17 నాటికి తహశీల్దార్ కార్యాలయంలో అందజేయాలన్నారు. ఇంటింటికి తిరగకుండా ఒక చోట కూర్చొని గ్రామస్థాయి నాయకులు చెప్పిన విధంగా జాబితా రూపొందించినట్లు తెలిస్తే అలాంటి వారిపై చట్టపరమైన చర్యలు తీసుకొంటామని హెచ్చరించారు. ఈ శిక్షణా కార్యక్రమంలో డిప్యూటి తహశీల్దార్ వెంకటేశ్వర్లు తదితరులు పాల్గొన్నారు.

# పోలీసు బందోబస్తు మధ్య ఉపాధ్యాయుల బదలీలు!

జిల్లాలో ఉపాధ్యాయుల బదలీల ప్రక్రియ ఆరంభమైంది. ప్రభుత్వం ఈ బదలీలకు పచ్చజెండా ఊపడంతో జిల్లా విద్యాశాఖ ఈ కార్యక్రమాన్ని చేపట్టింది. ఆయా ప్రాంతాలలోని పాఠశాలల్లో పనిచేస్తూ ఎనిమిదేళ్ల సర్వీసు పూర్తి చేసుకొన్న ఉపాధ్యాయులతోపాటు రెండేళ్ల సర్వీసు పూర్తి చేసుకొన్నవారు బదలీలకి అర్హులుగా ప్రభుత్వం మార్గదర్శకాలు జారీ చేసింది. దీనికి అనుగుణంగా అధికారులు బదలీలు చేపట్టారు. అంతవరకు బాగానే వున్నా బదలీలు జరిగే ప్రాంతంలో పోలీసు బందోబస్తు ఏర్పాటు కావడం చూసేవారిని ఆశ్చర్యపరుస్తోంది. సమాజంలో గురువుకున్న ప్రాధాన్యం తెలిసిందే. పలువురికి ఆదర్శంగా వుండాల్సిన ఉపాధ్యాయులు గొడవలకు దిగతుండడం, అరుపులు కేకలతో బదలీల ప్రక్రియలో గందరగోళం చేస్తుండడంతో పోలీసు బందోబస్తు ఏర్పాటు చేసుకొనే స్థితి దాపురించిందని పలువురు ఆవేదన వ్యక్తం చేస్తున్నారు. ఈ పరిస్థితుల్లో విద్యాశాఖ అధికారుల తీరు సిబ్బంది వ్యవహారంపైనా విమర్శలు వస్తున్నాయి. ఎన్నిసార్లు జాబితాలో తప్పొప్పులు జరిగినా, బదలీల ప్రక్రియలో ఆలస్యం జరుగుతున్నా, నిర్ణీత సమయంలో జరగకుండా అర్ధరాత్రి అపరాత్రి వరకు జరిగిన అనుభవాలు గతంలో ఎన్నో వున్నా ఇప్పటికి విద్యాశాఖ తీరు మార్చుకోకపోవడం పై విమర్శలు వ్యక్తమౌతున్నాయి. ప్రస్తుతం జరిగే బదలీల ప్రక్రియయైనా సక్రమంగా జరుగుతుందా, గొడవలు, గందరగోళాలకు దారి తీస్తాయో వేచి చూడాల్సి వుంది.

# ట్రాన్స్‌ఫార్మర్ల దొంగల అరెస్టు

## గూడూరు పోలీసుల ఘనతిది

గత కొద్దిరోజులుగా పొలాలు, తోటల్లో వుండే విద్యుత్ ట్రాన్స్‌ఫార్మర్‌లు అందులో వుండే రాగి, అల్యూమినియం వైర్లను దొంగిలిస్తూ రైతులకు కంటిమీద కునుకు లేకుండా చేస్తున్న దొంగల ముఠా గూడూరు పోలీసులకు చిక్కింది. మండల పరిధిలో గత కొద్దిరోజులుగా ఒక ముఠా సంచరిస్తూ ట్రాన్స్‌ఫార్మర్‌లు ఎక్కడ వున్నాయో గుర్తించి వాటిని గొల్లపల్లి సబ్‌స్టేషన్‌లో ఎలక్ట్రిషియన్‌గా పనిచేసే పోకూరు శివ అనే వ్యక్తికి అందించేవారు. అతను దొంగతనానికి ప్లాన్ చేసిన ప్రాంతంలో విద్యుత్ సరఫరా నిలిపి వేసి వారికి సహకరించేవాడట. దొంగతనాలపై రైతులు పోలీసులకు ఫిర్యాదులు చేయడంతో రూరల్ సిఐ, ఐడి పార్టీ కాపుకాచి ఈ ముఠాను పట్టుకోవడంతో వీరి బండారం బట్టబయలైంది. ఈ ముఠా నుంచి 665 కేజీల రాగి తీగలను 10 కేజీల అల్యూమినియం తీగలను స్వాధీనం చేసుకున్నారు.

# గౌరవరం కార్యదర్శిని నిర్భందించిన గ్రామస్తులు!

త్రాగునీటి సమస్య పరిష్కరించాలని పలుమార్లు అధికారులకు తెలిపినా పట్టించుకోకపోవడంతో కడుపుమండిన ప్రజలు పంచాయితీ కార్యదర్శిని నిర్భందించిన ఘటన కావలి రూరల్‌మండలం గౌరవరంలో జరిగింది. ఈ ప్రాంతంలో కొంతకాలంగా త్రాగునీటి సరఫరా లేక స్థానికులు తీవ్ర ఇబ్బందులు పడుతున్నారు. దాహార్తి తీర్చుకొనేందుకు దూరప్రాంతాలకు వెళ్లి నీటిని తెచ్చుకొంటున్నారు. మంచినీటి సమస్య పరిష్కరించమని, త్రాగునీటి సరఫరా సక్రమంగా జరిగేలా చూడమని పలుమార్లు మండల అధికారులు, పంచాయితీ కార్యదర్శులను కోరినా పట్టించుకోకపోవడంతో ఆగ్రహించిన గ్రామస్తులు కార్యాలయంలో వున్న సెక్రటరీ చెన్నకేశవులను గదిలో పెట్టి తాళం వేశారు. సమాచారాన్ని ప్రత్యేకాధికారి, తహశీల్దార్‌కు తెలిపారు. చివరకు గ్రామపెద్దల జోక్యంతో కార్యదర్శిని వదిలి పెట్టారు.

# బుచ్చి ఆర్యవైశ్య సంఘం అధ్యక్షునిగా హరనాధ్!



బుచ్చిరెడ్డిపాళెం మండలం ఆర్యవైశ్య సంఘం నూతన అధ్యక్షుడిగా దుగ్గిశెట్టి హరనాధ్ ఏకగ్రీవంగా ఎన్నికయ్యారు. ఇటీవల బుచ్చిపట్టణం పెద్దూరులో గల ఆర్యవైశ్య సత్రంలో సంఘం ఎన్నికలు జరిగాయి. ఆ ఎన్నికలలో హరనాధ్ అధ్యక్షునిగా ఏకగ్రీవంగా ఎన్నికయ్యారు. ఆయన మండలంలో తెలుగుదేశంపార్టీకి మిలిటెంట్ కార్యకర్త. చాలాఏళ్లుగా టిడిపిలో చురుకైన పాత్ర పోషిస్తున్నాడు. మండల కార్యదర్శిగా వాయిగుండ్ల శ్రీనివాసులు ఎంపికయ్యారు. ఈ సందర్భంగా వారు మాట్లాడుతూ ఆర్యవైశ్య సంఘం బలోపేతానికి కృషి చేస్తామన్నారు. నూతన కమిటీని కోటంరెడ్డి రాధాకృష్ణారెడ్డి, రంగనాధం, నాగరాజు, శేషయ్య, రాధయ్యలు అభినందించారు.



నెల్లూరు మాదరన్ ఐ హాస్పిటల్ డైరెక్టర్ డాక్టర్ ఓగిరాల గోపాలకృష్ణ తన కుమారుడు అనిరుధ్ జన్మదినోత్సవాన్ని పురస్కరించుకొని కలెక్టర్ శ్రీధర్‌రెడ్డి మానసపుత్రిక సరస్వతి నిధికి 25వేల రూపాయల విరాళాన్ని అందిస్తున్న దృశ్యం. చిత్రంలో వాస్తు రామచంద్ర వున్నారు.

# బీదను నిలదీసిన కడనూతల యువత!

- అప్పటికప్పుడే రూ.25లక్షల పనులకు వాగ్దానం

ప్రజా సమస్యలపై స్పందిస్తూ, సొంత నిధులను ఖర్చు చేస్తున్న కావలి శాసనసభ్యుడు బీద మస్తాన్‌రావుకి గ్రామస్తుల నుంచి నిరసన వ్యక్తం అయిన ఘటన బోగోలు మండలం కడనూతలలో చోటు చేసుకొంది. ఇటీవల ఈ గ్రామంలో ఎస్సీ, ఎస్టీ సబ్‌ప్లాన్‌పై సభ జరిగింది. ఈ కార్యక్రమానికి ఎమ్మెల్యే బీద మస్తాన్‌రావు హాజరై సబ్‌ప్లాన్ గురించి ప్రస్తావిస్తుండగా గ్రామానికి చెందిన యువకులు కొందరు అడ్డుతగిలారు. ఎన్నికల సమయంలో ఒకసారి వచ్చిన మీరు తిరిగి మా ముఖం చూడలేదు. ఇప్పుడు అధికారులతో కలిసి వచ్చి ఎస్సీ, ఎస్టీల అభివృద్ధి అంటున్నారు. ఇప్పటివరకు చేయని అభివృద్ధి ఇప్పుడు చేస్తారా? అంటూ నిలదీశారు. దీంతో బీద మస్తాన్‌రావుకు నోట మాట రాలేదు. కొంతసేపటికి తేరుకొన్న ఆయన నిజమే గతంలో ఒక్కసారి రచ్చబండ కార్యక్రమానికి మాత్రం వచ్చాను అని చెప్పారు. ప్రభుత్వం తరఫున ఎస్సీ, ఎస్టీల అభివృద్ధికి, పంచాయితీ తరఫున 5లక్షలు, ఎమ్మెల్యే గ్రాంట్ క్రింద 5 లక్షలు, సొంత నిధులు 20లక్షల రూపాయలతో ప్రతి ఇంటికి మంచి నీటి కొళాయి వేయిస్తానని, సిమెంటురోడ్డు నిర్మిస్తామని, ఇంటి స్థలాలు కేటాయిస్తామని వరాల వర్షం కురిపించారు. తనను గట్టిగా నిలదీసిన యువకులను బుజ్జగిస్తూ గట్టిగా మాట్లాడి సమస్యలు నాకు అర్థమయ్యేలా చేశారు. చాలా సంతోషం. ఇకపై కడనూతల ఎస్సీ కాలనీ అభివృద్ధికి ప్రత్యేక దృష్టిసారిస్తానని హామీ ఇవ్వడంతో గ్రామస్తులు శాంతించారు. ప్రజలు చైతన్యవంతులై శాసనసభ్యులను ఇలా నిలదీస్తే సమస్యలు త్వరగా పరిష్కారమవుతాయోమో చూడాలి.

## పాలిష్ పేరుతో దగా!

**మహిళలు జర జాగ్రత్త!**

నగల మెరుగు పేరుతో బంగారాన్ని తస్కరించబోయిన బాలుడు పట్టుబడిన ఘటన కలువాయిలో చోటు చేసుకొంది. స్థానిక కనకమహాల్ వీధిలో నివసిస్తున్న సుబ్బలక్ష్మమ్మ అనే మహిళ వద్దకు నీరజ్‌కుమార్ అనే బాలుడు బంగారం మెరుగు పెట్టిస్తానని వచ్చాడు. ఆ వ్యక్తి మాటలు నమ్మిన ఆమె వెండి వస్తువులతోపాటు, సరుదు తీసిచ్చింది. మెరుగుకు ఇచ్చిన సరుదులో తూకం తగ్గినట్లుగా గుర్తించి ఆ మహిళ దీనిపై నిలదీయగా ఆ వ్యక్తి పారిపోబోతుండగా కేకలు వేయడంతో చుట్టుప్రక్కల వాళ్లు గుమికూడి హోంగార్డు మల్లిఖార్జున్‌కి అప్పగించారు. మెరుగుపెట్టిన బంగారాన్ని తూకం వేయగా 28గ్రాములు వుండాల్సిన సరుదు 19గ్రాములు బరువు వుంది. దీంతో బాధితురాలు పోలీసులకు ఫిర్యాదు చేయగా పోలీసులు నీరజ్‌ను అదుపులోకి తీసుకొని విచారిస్తున్నారు.

## దేవాలయాల్లో చోరీలు చేసిన దొంగల ముఠా అరెస్ట్!

**దేవుడున్నాడు**

జిల్లాలో పలు దేవాలయాల్లో వరుస చోరీలకు పాల్పడుతున్న దొంగలముఠా పోలీసులకు చిక్కింది. కలువాయి, చేజర్ల, అనంతసాగరం, ఆత్మకూరు మండలాల్లోని పలు దేవాలయాల్లో రెండేళ్లుగా వరుస చోరీలు జరుగుతున్నాయి. దేవుని నగలతోపాటు హుండీలోని సొత్తు దొంగలించబడింది. ఈ వరుస చోరీలపై ఫిర్యాదులు రావడంతో కలువాయి పోలీసులు నిఘా పెట్టారు. ఐదుగురు సభ్యుల ముఠా ఈ చోరీలకు పాల్పడుతున్నట్లు గుర్తించిన పోలీసులు దర్యాప్తు జరుపగా బుచ్చికి చెందిన గురునాథం, జలదంకికి చెందిన కట్టా బాబు దొరికారు. వీరి వద్ద నుంచి నాలుగు తాళిబొట్లు, 50 గ్రాముల వెండి లక్ష్మీదేవి విగ్రహాన్ని స్వాధీనం చేసుకొన్నారు. ఈ ఇద్దరుగాక ఆత్మకూరుకు చెందిన నక్కా బుజ్జమ్మ, నాగలూరు కిరణ్, చేజర్ల గురునాథం, రమేష్‌లను ఈ ముఠాలో వున్నారని వీరిని త్వరలో అరెస్టు చేస్తామని సిఐ రోశయ్య, ఎస్‌ఐ రామ్మూర్తిలు తెలిపారు.

- నరుకూరులో

# ప్రభుత్వ భూమి కబ్జా!

## రియల్ ఎస్టేట్ వ్యాపారికి రెవెన్యూ సహకారం

తోటపల్లి గూడూరు మండలం నరుకూరు గ్రామం నడిబొడ్డులో లక్షల రూపాయల విలువైన ప్రభుత్వ భూమిని రియల్ ఎస్టేట్ వ్యాపారులు దర్జాగా కబ్జా చేసేసినా అడిగేవారే లేకుండాపోయారు. దీనిపై స్థానికులు రెవెన్యూ అధికారులకు ఫిర్యాదు చేసినా పట్టించుకోకపోవడంపై విమర్శలు వస్తున్నాయి. నరుకూరులో స్టేట్ బ్యాంక్ ఎదురుగా సర్వే నెంబర్ 1-1-ఏ లో 0.59 సెంట్ల ప్రభుత్వ భూమి వుంది. వాతావరణశాఖ వర్షపాతం నమోదు చేసేందుకు తగిన పరికరాలను ఇక్కడ ఏర్పాటు చేయాలని భావించారు. తర్వాతి కాలంలో ఆ ప్రయత్నం ఆగిపోయింది. ఇదే ప్రాంతంలో వున్న విశ్రాంతి గృహం శిథిలమైపోవడంతో ఖాళీ స్థలం ఏర్పడింది. ఒక్కసారిగా భూముల ధరలకు రెక్కలురావడం, చుట్టుప్రక్కల రియల్ఎస్టేట్ వ్యాపారం ఊపందుకోవడంతో వ్యాపారుల కన్ను ప్రభుత్వ భూమిపై పడింది. ప్రస్తుత విలువ ప్రకారం 80లక్షల రూపాయలు చేసే ఈ భూమిని రియల్టర్ దర్జాగా కబ్జా చేసేశాడు. దీనికి రాజకీయ అండదండలు, రెవెన్యూ సిబ్బంది సహకారం కూడా వుందట. ఆక్రమణపై స్థానికులు పలుమార్లు రెవెన్యూ అధికారులకు ఫిర్యాదు చేసినా పట్టించుకోకపోవడంతో ఇటీవల అక్కడకు వచ్చిన ఆర్డీఓ మాధవీలతకు స్థలం ఆక్రమణపై ఫిర్యాదు చేశారు. దీనిపై స్పందించిన ఆమె అది రెవెన్యూ స్థలమని బోర్డు పెట్టాలని ఆదేశించింది. అయితే ఆ బోర్డు ఏర్పాటు చేసేందుకు రెవెన్యూ అధికారులకు ధైర్యం లేకుండా పోయింది. స్థానికుల ఒత్తిడితో బలవంతంగా బోర్డు పెట్టినా, ఆ స్థలాన్ని ఆక్రమించిన రియల్‌వ్యాపారి అక్కడకు వచ్చి ఆ బోర్డును పీకిపడేశాడు. ఇంత జరిగినా అతనిపై చర్యలు చేపట్టేందుకు అధికారులు మీనమేషాలు లెక్కిస్తుండడం విమర్శల పాలవుతోంది.

# ఈనాటి ఈ బంధమేనాటిదో...

**తిప్ప పోలీసులు - దొంగల మధ్య మంచి అండర్ స్టాండింగ్**

నేరస్తులను పట్టుకోవాల్సిన పోలీసులు, ఆ నేరస్తులు, దొంగలతో మిలాఖత్ అయి దొంగతనాలకు తమవంతు సహకారం అందిస్తూ చివరకు పోలీసులకే చిక్కడం బిట్రగుంటలో కలకలం రేపింది. ఇటీవల కొంతకాలంగా బోగోలు మండల పరిధిలో జాతీయ రహదారిపై దొంగతనాలు అధికమయ్యాయి. వీటిపై బాధితులు పోలీసులకు ఫిర్యాదులు చేసినా పట్టించుకోలేదు. ఈ నేపథ్యంలో కావలి డిఎస్పీ గన్‌మెన్‌పైనే ఏకంగా దొంగలు దాడి చేయడం సంచలనం కల్గించింది. దీనిపై విచారణ జరిపిన పోలీసులకు ఆశ్చర్యపోయే విషయాలు తెలిశాయి. పోలీసులే చాలామందికి దొంగలతో సంబంధ బాంధవ్యాలు వున్న విషయం బయటపడింది. డిఎస్పీ గన్‌మెన్‌పై దాడి చేసిన వారిలో ఒకడు దేవరకొండ మాధవ్ అనే వ్యక్తిని అరెస్టు చేసి విచారించగా బిట్రగుంట పోలీస్‌స్టేషన్‌లో హెడ్‌కానిస్టేబుల్ ఖాసిం, కానిస్టేబుల్ శ్రీకాంత్, శ్రీనాథ్ దోపిడీ ముఠాలతో ఫోన్‌లో సంభాషిస్తున్నట్లు విచారణలో తేలింది. సెల్‌ఫోన్ కాల్స్ డేటా ఆధారంగా వీరిగుట్టురట్టయ్యింది. బయట ప్రాంతాలకు చెందిన పోలీసులు ఇక్కడకు వచ్చిన సమయంలో ఈ పోలీసులే దొంగలకు ముందుగా సమాచారం అందిస్తున్నట్లు తెలిసింది. ఈ ముగ్గురు పోలీసు సిబ్బందిని ఎస్పీ సస్పెండ్ చేశారు. దీనిపై సమగ్ర విచారణ జరిపితే మరింతగా పోలీసులు, దొంగల మధ్య వున్న సంబంధాలు వెలుగుచూస్తాయని పలువురు వ్యాఖ్యానిస్తున్నారు.

# మైపాడు బీచ్‌ను అద్భుతంగా అభివృద్ధి చేస్తా!

**ఆర్థికమంత్రి భరోసా**



పర్యాటకుల తాకిడి అధికంగా వుండే మైపాడు బీచ్ అభివృద్ధికి ఎట్టకేలకు ప్రభుత్వం చర్యలు చేపట్టింది. పర్యాటకశాఖ ఆధ్వర్యంలో ఈ ప్రాంతంలో మూడుకోట్ల 50లక్షల రూపాయలతో హరిత రిసార్ట్స్‌ను నిర్మించారు. ఇటీవల ఈ రిసార్ట్స్‌ను ప్రారంభించేందుకు ఆర్థికమంత్రి ఆనం రామనారాయణరెడ్డి, పర్యాటకశాఖ మంత్రి వట్టి వసంతకుమార్‌లు విచ్చేశారు. ఈ సందర్భంగా ఆనం మాట్లాడుతూ గతంలో తాను పర్యాటకశాఖ మంత్రిగా వున్నప్పుడు మైపాడు బీచ్ అభివృద్ధికి నిధులు మంజూరులో కొంత అయోమయస్థితి నెలకొని వుండిందన్నారు. ప్రస్తుతం మంత్రి వసంతకుమార్ సహకారంతో నిధుల మంజూరులో వున్న సందిగ్ధత తొలగిపోయిందన్నారు. మైపాడుబీచ్‌ను అన్ని విధాలా అభివృద్ధి పరచి ప్రపంచ పర్యాటక రంగంలో తలమానికంగా తీర్చిదిద్దేందుకు కృషి చేస్తామన్నారు. జిల్లాలోని పర్యాటక ప్రాంతాల అభివృద్ధికి కృషి చేస్తామని మంత్రి వట్టి వసంతకుమార్ తెలిపారు. కోడూరు బీచ్‌ను, మైపాడు బీచ్‌ను అనుసంధానం చేసేందుకు తగిన ప్రణాళికలు రూపొందిస్తున్నామన్నారు. అలాగే కావలి తుమ్మలపెంట ప్రాంతాన్ని అభివృద్ధి చేసేందుకు, రిసార్ట్స్ నిర్మించేందుకు ప్రతిపాదనలు సిద్ధం చేస్తున్నట్లు సభాముఖంగా ప్రకటించారు. ఈ కార్యక్రమంలో జిల్లా కలెక్టర్ శ్రీధర్, ఎస్పీ రమణకుమార్ తదితరులు పాల్గొన్నారు.

# గూడూరు ఫ్లైఓవర్ నిర్మాణంలో మతలబు!



ప్రజలకు ఉపయోగపడని వైపు ముందు నిర్మాణం.

గూడూరు పట్టణంలో నిర్మిస్తున్న రైల్వేఓవర్ బ్రిడ్జి నిర్మాణపనుల విషయంలో అధికారుల తీరు విమర్శలకు తావిస్తోంది. పట్టణ ప్రజలకు ఉపయోగకరంగా వుండే వైపు ఇప్పటివరకు చిన్న పని ప్రారంభించని అధికారులు నెల్‌కాస్ట్ ఫ్యాక్టరీ వెళ్లే వైపు మాత్రం చకచకా పనులు జరిపిస్తుండడంపై సర్వత్రా నిరసన వ్యక్తమవుతోంది. గత కొన్నేళ్లుగా గూడూరు వన్‌టౌన్, టూటౌన్‌లు పెరిగిన జనాభాకు తగినట్లు విస్తరించాయి. ఇరువైపులా రాకపోకలు సాగించేందుకు రైల్వే అండర్ బ్రిడ్జి మీదుగా రావాల్సి వుండడంతో నిత్యం ట్రాఫిక్ సమస్య తలెత్తేది. ఇక్కడ రైల్వే ఓవర్ బ్రిడ్జి నిర్మించాలని పట్టణ ప్రజల కోరిక మేరకు గత ఏడాది శంకుస్థాపన చేశారు. వన్‌టౌన్‌లోగల ఎస్ఎంఐ స్కూలు వద్ద ప్రారంభించి సొసైటీ సెంటర్ మీదుగా ఆ ప్రాంతంలోని రైల్వేలైనును దాటుతూ ఒక లైన్ నెల్‌కాస్ట్ ఫ్యాక్టరీ వైపు, మరొక లైన్ సిరామిక్ కాలేజి వైపు నిర్మించేందుకు డిజైన్ చేశారు. నెల్‌కాస్ట్ వైపు వెళ్లేరోడ్డు ఆ ఫ్యాక్టరీకి తప్ప ప్రజలకు ఏమాత్రం ఉపయోగపడదు. ఇక రెండవవైపు సిరామిక్ కాలేజ్ వద్ద ముగుస్తుంది. ఈ వైపు ఇంతవరకు పిల్లర్ల నిర్మాణం కూడా జరగలేదు. దీనిపై అధికారులను ప్రశ్నిస్తే రెండో పట్టణ పరిధిలో నిర్మాణానికి ఇంకా అనుమతులు రాలేదని చెప్తున్నారు. ప్రజలకు రాకపోకలకు ఇబ్బందులు తలెత్తకుండా నిర్మించాల్సిన బ్రిడ్జిని కొందరు సీనియర్ నేతలు స్వార్థం కోసం, ఫ్యాక్టరీల కోసం ఈ ప్రాంతంలో నిర్మిస్తుండడంపై పట్టణ ప్రజల నుంచి తీవ్ర నిరసన వ్యక్తం అవుతోంది.

# చెంగాళమ్మ బ్రహ్మోత్సవాలు!

**మే 30తేదీ మొదలు**

సూళ్లూరుపేట చెంగాళమ్మ పరమేశ్వరి బ్రహ్మోత్సవాలు మే 30 నుంచి జరుగనున్నాయి. ఈ బ్రహ్మోత్సవాలను వైభవంగా నిర్వహించేందుకు అన్ని ఏర్పాట్లు చేస్తున్నది పాలక మండలి. ఏడేళ్లకు ఒకసారి జరిగే చెంగాళమ్మ ఉత్సవాలకు విశేష ప్రాధాన్యముంది. మే 30 నుండి జూన్ 5వ తేది వరకు జరిగే బ్రహ్మోత్సవాలలో పాల్గొనేందుకు భక్తులు అధికసంఖ్యలో పాల్గొంటారు. మొదటి మూడు రోజులు 'సుళ్లు' ఉత్సవం, మహిషాసుర మర్దిని, తెప్పోత్సవం ముఖ్యమైనవి. భక్తులకు ఎలాంటి అసౌకర్యం కలుగకుండా అన్ని చర్యలు చేపడుతున్నట్లు ఆలయ పాలక మండలి ఛైర్మన్ ఇసనాక హర్షవర్ధన్‌రెడ్డి తెలిపారు.

# గజిబిజి గందరగోళం!

- బుచ్చిలో ట్రాఫిక్ తీరిది.

బుచ్చిరెడ్డిపాళెంలో ట్రాఫిక్ అస్తవ్యస్తంగా మారింది. ఎవరికి వారు ఇష్టం వచ్చినట్లు వాహనాలు నిలుపుతుండడం, తోపుడు బండ్లపై వ్యాపారం చేసేవారు అడ్డదిడ్డంగా బండ్లు పెడుతుండడంతో రోడ్డుపై నడవాలంటేనే కష్టతరంగా మారింది. ఇంతగా ట్రాఫిక్ గందరగోళంగా, చిందరవందరగా మారుతున్నా చక్కదిద్దాల్సిన పోలీసులు అది తమ పనే కాదన్నట్లు వ్యవహరిస్తుండడంపై విమర్శలు వ్యక్తం అవుతున్నాయి. రోజు మామూళ్లు తోపుడుబండ్ల వ్యాపారులు, ఆటోల నుంచి దండుకొంటూ ఈ వ్యవహారాన్ని పట్టించుకోకుండా వదిలేస్తున్నారన్న ఆరోపణలు వస్తున్నాయి. బుచ్చిలో ప్రధానంగా బుచ్చి - చెన్నూరు రోడ్డు, నెల్లూరు, ఆత్మకూరుకు పోయే మార్గాలలో ట్రాఫిక్‌కు తీవ్ర అంతరాయం ఎదురౌతోంది. అంగళ్లు ముందుకు చొచ్చుకొచ్చి రోడ్డును ఆక్రమించేయడంతో వెడల్పాటి రోడ్డు కుచించుకపోతుండడంతో రాకపోకలకు తీవ్ర అంతరాయం ఏర్పడుతోంది. అంగళ్ల ముందు నెట్టుడు బండి పెట్టుకోవాలంటే రెండొందల రూపాయలు ఇవ్వాలి. జమీలాహాలు నుంచి కార్తికేయ రెస్టారెంట్ వరకు రోడ్డుకు ఇరువైపులా టాటామ్యాజిక్ వాహనాలు నిలిపేస్తుంటారు. దీనిపై ప్రశ్నిస్తే పోలీసులకు మామూళ్లు ఇస్తున్నాం అంటూ దబాయిస్తున్నారు. సంగం నుంచి నెల్లూరు పోయే మార్గంలో అరటిపండ్లు, పూలు అమ్మే వ్యాపారులు, ఆటోవారి రౌడీయిజం, బుచ్చి-చెన్నూరు రోడ్డులో కూరగాయలు, పండ్ల వ్యాపారులు బండ్లు పెట్టే స్తున్నారు రోడ్డుపైనే. ఆంధ్రాబ్యాంక్ వీధిలో పోవాలంటేనే గంటసేపు పడుతుంది. బుచ్చి పోలీసులకు మామూళ్ల వసూళ్లు చేయడంపై వున్న శ్రద్ధ ట్రాఫిక్ చక్కదిద్దే దానిపై వుండకపోవడంతో అస్తవ్యస్తంగా మారింది ట్రాఫిక్.

# బోగోలులో సమస్యల తిష్ట!

ప్రతి పంచాయితీలోనూ సమస్యలే!

బోగోలు మండలంలోని వివిధ పంచాయితీలలో ప్రజలు సమస్యలతో సతమతం అవుతున్నా పట్టించుకొనేవారే లేకుండా పోయారు. జిల్లా అధికారులు, మండల అధికారులు ప్రత్యేక సమావేశాలు, సమీక్షలు జరిపి గ్రామాల్లో సమస్యలను పరిష్కరించాలని ఆదేశిస్తున్నా క్రింది స్థాయి సిబ్బందిలో మార్పురాకపోవడంతో పంచాయితీలో సమస్యలు అలాగే తిష్ట వేసుకొని వుంటున్నాయి. బోగోలు మండలం పరిధిలో 16 పంచాయితీలున్నాయి. పారిశుధ్య సమస్య, త్రాగునీటి సమస్య పంచాయితీలను పట్టి పీడిస్తున్నాయి. చాలా గ్రామాల్లో వీధిలైట్లు లేక చీకట్లు అలుముకొని వుంటున్నా పట్టించుకొనే నాధుడే లేకుండాపోయారు. పలుమార్లు అధికారుల దృష్టికి తీసుకొని వచ్చినా ఉపయోగం లేకుండా పోతోంది. పంచాయితీ కార్యదర్శులు, స్పెషలాఫీసర్లు ఆయా పంచాయితీలవైపు కన్నెత్తి చూడక పోతుండడంతో సమస్యలు పరిష్కారానికి నోచుకోవడం లేదని మండల ప్రజలు వాపోతున్నారు.



● వాత్సల్యదాయిని

# వాసవి కన్యకా పరమేశ్వరి!

అమ్మవారి అవతారంగా పూజలందుకునే దేవతామూర్తి శ్రీ కన్యకా పరమేశ్వరి. ఆమెనే శ్రీవాసవి మాత అని కూడా పిలుస్తారు. ప్రధానంగా ఆర్యవైశ్యుల కులదేవత అయినప్పటికీ ప్రజలందరి చేత పూజింపబడుతున్న దేవత. దేవాలయాలు మానవుని ఆధ్యాత్మిక జీవనానికి జీవగర్రలు. మానవుల సమస్యలు తీర్చేందుకు వారి పాపాలు తొలగించి పుణ్యాన్ని ప్రసాదించేందుకు ముక్కోటి దేవతలుగా అవతరించారు. హిందూ సాంప్రదాయంలో ప్రతి దేవతకు, దేవునికి ఆలయాలు నిర్మించి పూజించడం చేస్తారు. అలాంటి దేవాలయాల్లో శ్రీవాసవి కన్యకాపరమేశ్వరి ఆలయం ఒకటి. పశ్చిమ గోదావరి జిల్లా పెనుగొండలో వుండే ఈ ఆలయానికి ఎంతో విశిష్టత వుంది. వైశ్యుల ఇంట జన్మించిన వాసమాంబ తన ఇష్టానికి వ్యతిరేకంగా రాజుతో బలవంతపు వివాహాన్ని ధిక్కరిస్తూ హోమగుండంలో దూకి ప్రాణ త్యాగం చేసింది. ఆమె ఆత్మత్యాగానికి గుర్తుగా ఆ ప్రాంతంలో ఆలయం నిర్మించి పూజలు చేస్తున్నారు.

వాసవిమాత ప్రాణత్యాగానికి సంబంధించి పురాణ గాధ ఒకటి ప్రచారంలో వుంది. ఇంద్రుడు శచీదేవుల కుమారుడు జయంతుడు. ఒకానొక సమయంలో రాక్షసులతో యుద్ధం చేయమని బ్రహ్మ ఆదేశించగా శచీదేవి అందుకు ఒప్పుకోదు. దీంతో ఆగ్రహించిన బ్రహ్మ భూలోకంలో వైశ్యుని ఇంట పుట్టమని శపిస్తాడు. ఇంద్రుడు ప్రాధేయపడగా శాంతించిన సృష్టికర్త ఆమె భూలోకంలో పుట్టినా ఎవ్వరినీ పెళ్లాడకుండా తిరిగి స్వర్గానికి వస్తుందని అభయమిస్తాడు. ఆ శాపం కారణంగా శచీదేవి పెనుగొండను పాలించే కుసుమశ్రేష్టి, కుసుమాంబ దంపతులకు జన్మిస్తుంది. చిన్ననాటి నుంచే దైవచింతన కల్గి వుండేది. ఆ సమయంలో వంగీ దేశప్రభువైన విష్ణువర్ధనుడు పెనుగొండ వచ్చి సౌందర్యరాశి అయిన వాసమాంబను చూసి ముగ్ధుడై వివాహం చేసుకొంటానని ఆమె తల్లిదండ్రులను అడుగుతాడు. దీనికి కుసుమశ్రేష్టి, కుసుమాంబలతోపాటు గ్రామస్తులు అంగీకరించరు. వాసమాంబ ఇష్టానికి వ్యతిరేకంగా వివాహం చేయమని ఖరాఖండీగా చెప్తారు. దీనికి ఆగ్రహించిన రాజు ఊరి మొత్తాన్ని నాశనం చేసేందుకు సిద్ధమయ్యాడు. రాజుతో పోరాడలేక, తమ అభిమతానికి వ్యతిరేకంగా వ్యవహరించలేక అధికసంఖ్యాకులు మంటల్లోదూకి ఆత్మహత్య చేసుకొంటారు. ఇది చూసిన వాసవి మనసు ద్రవించి ఆత్మత్యాగానికి సిద్ధమయ్యింది. కుటుంబసభ్యులు అడ్డుచెప్పడంతో తన జన్మవృత్తాంతం చెప్పి అభయమిస్తుంది. హోమగుండంలో దూకి ప్రాణత్యాగం చేసిన వాసమాంబ స్వర్గానికి చేరుకుంటుంది. కన్యగా మరణించడంతో కన్యకాంబ అని, కన్యకాపరమేశ్వరి అని పిలుస్తారు. ఆనాటి నుంచి వైశ్య కులస్తులకు కులదేవతగా మారింది. కన్యకా పరమేశ్వరికి నేడు రాష్ట్రంలో పలు ప్రాంతాలలో ఆలయాలు నిర్మించి పూజిస్తున్నారు. J

ఆక్రందన

● మహిళలు, యువతులు, బాలికలపై

# అఘాయిత్యాల పరంపర!

**నెల్లూరు నగరంతోపాటు చిట్టమూరు, అనుమసముద్రంపేట, నాయుడుపేట, టపాతోపు ప్రాంతాల్లో మహిళలు, యువతులు, బాలికలపై లైంగిక దాడులు జరిగాయి. కొన్నిచోట్ల భార్యల శీలాలను శంకించి వాళ్లను చంపిన కిరాతక భర్తల సంఖ్యా పెరిగిపోయింది.**

జిల్లాలో ఇటీవల మహిళలు, బాలికలపై అఘాయిత్యాలు అధికమైనాయి. ప్రతిరోజు ఏదో ఒక ప్రాంతంలో మహిళలు, బాలికలపై లైంగిక దాడులు జరుగుతూనే వున్నాయి. పోలీస్‌శాఖ చట్టాలు కఠినంగా వున్నప్పటికి న్యాయస్థానాల్లో నిందితులకు శిక్షలు పడడం లేదు. లైంగిక దాడులకు సంబంధించి కేసు నమోదు చేసుకొని, అనంతరం నిందితుల్ని అరెస్టు చేసేందుకు మాత్రమే పోలీసులు పరిమితమైపోయారన్న విమర్శలు వినిపిస్తున్నాయి. కేసు నమోదు కాబడిన తర్వాత సమగ్రంగా దర్యాప్తు జరిపి నిందితులపై అభియోగాలు నమోదు చేసి కోర్టుకు సమర్పించాల్సిన పోలీసులు కొన్ని రాజకీయ ఒత్తిళ్ల కారణంగా లోతుగా పరిశీలన చేయడం లేదన్న ఆరోపణలు వున్నాయి. కోర్టులో కేసు సంవత్సరాల తరబడి నడవడం ఈలోగా బాధితులను వివిధ ప్రలోభాలకు గురి చేస్తుంటారు.

లైంగిక దాడులకు సంబంధించి కొన్ని సంఘటనలు పోలీస్‌స్టేషన్‌కు చేరడం లేదు. ప్రధానంగా గ్రామీణప్రాంతాల్లో ఇటువంటి సంఘటనలు జరిగినప్పుడు పెద్ద మనుషులు రాజీ ప్రయత్నాలు చేసి పోలీస్ స్టేషన్‌కు వెళ్లకుండా సర్దుబాటు చేస్తుంటారు. రాజీ ప్రయత్నాలు విఫలం చెందిన తర్వాతనే బాధితులు ఫిర్యాదు చేయడం జరుగుతుంటుంది. లైంగిక దాడులతోపాటు హత్యలు జరుగుతున్నా నియంత్రించే వ్యవస్థ లేకుండా పోయింది. నెల్లూరు నగరంలో రెండు నెలల క్రితం హరనాధపురంలో తల్లీకూతుళ్లను కిరాతంగా హత్య చేయబడిన సంగతి తెలిసిందే. ఈ సంఘటన అనంతరం తాళి కట్టిన భార్యలపై అనుమానాలతో హత్యలు జరిగాయి. గత నెలలో కేవలం అక్రమ సంబంధాలు కలిగి వున్నారన్న కారణంతో ఇద్దరు మహిళలు దారుణంగా చంపబడ్డారు.

నెల్లూరు నగర, రెండవ నగర పోలీస్‌స్టేషన్ పరిధిలో ఒకటి కాగా, మరొకటి ఎఎస్‌పేట పోలీస్‌స్టేషన్ పరిధిలో జరిగింది. రోజురోజుకు పెరిగిపోతున్న నేరప్రవృత్తి కారణంగా మహిళలు, విద్యార్థినులు ఒంటరిగా బయటకు రావాలంటేనే భయపడాల్సిన పరిస్థితులు ఏర్పాడ్డాయి. చిట్టమూరు, నాయుడుపేట పోలీస్‌స్టేషన్ల పరిధిలో ఐదు, తొమ్మిది సంవత్సరాల వయసు కలిగిన బాలికలపై లైంగిక దాడి జరిగిందంటే సమాజంలో నేర సంస్కృతి ఎలా పెరిగిపోతుందో ఊహించుకోవచ్చు. ప్రభుత్వం ఎన్ని కఠిన చట్టాలు తీసుకొస్తున్నా మహిళలు, ముక్కుపచ్చలారని బాలికలపై లైంగిక దాడులు ఆగడం లేదు. ఏదైనా సంఘటన జరిగినప్పుడు మాత్రమే మహిళా సంఘాలు ఆందోళన చేస్తున్నాయి. మిగిలినప్పుడు మహిళలు ఎదుర్కొంటున్న సమస్యల గురించి పట్టించుకోవడం లేదు. అత్యాచారయత్నానికి ప్రయత్నించినప్పుడు ఎవరైనా ప్రతిఘటిస్తే చంపేందుకు ప్రయత్నిస్తున్నారు.

గతవారంలో కొడవలూరు పోలీస్‌స్టేషన్ పరిధిలో ఓ వివాహితపై లైంగిక దాడి జరిగింది. తలమంచి నుంచి నెల్లూరుకు వెళ్లేందుకు రాత్రి 7గంటల సమయంలో ఆటో ఎక్కింది. టపాతోపు దగ్గరకు వచ్చిన తర్వాత ఆటోడ్రైవర్ ఆటోలో వున్న మహిళపై అత్యాచారం చేసేందుకు ప్రయత్నించాడు. ఈ ఘటనతో ఆందోళన చెందిన బాధితురాలు ఆటోలో నుంచి దూకేసింది. అల్లూరువైపు నుంచి మరో ఆటో రావడాన్ని గమనించిన నిందితుడు అక్కడ నుంచి పరారైనాడు. కొడవలూరు పోలీస్ స్టేషన్‌లో ఫిర్యాదు చేసి తలమంచికి వెళ్లిపోయింది. ఇవి కేవలం ఉదాహరణలు మాత్రమే. మహిళలపై దాడులు జరిగినప్పుడు కొందరు కుటుంబం పరువు ప్రతిష్టలను దృష్టిలో వుంచుకొని బయటకు పొక్కకుండా జాగ్రత్తపడి లోపల కుంగిపోతున్నారు. కేసులు నమోదు చేసుకున్న పోలీసులు విచారణ వచ్చేటప్పటికి ఇతర ప్రాంతాలకు బదలీ అవుతుండడం కూడా దర్యాప్తుకు ఆటంకంగా మారుతుంది.

మహిళా సాధికారితకు పెద్దపీట వేస్తున్నామని ప్రకటిస్తున్న పాలకులు లైంగిక దాడుల పట్ల స్పందించకపోవడంపై విమర్శలు వెల్లువెత్తుతున్నాయి. సమాజంలో మానవతా విలువలు మంట కలిసిపోతున్నాయి. వావివరసలు లేకుండా ప్రేమ వ్యవహారాలు నడుస్తున్నాయి. ప్రతి సోమవారం జిల్లా పోలీస్ కార్యాలయంలో జరిగే ప్రజావిజ్ఞప్తుల కార్యక్రమానికి అధికసంఖ్యలో ప్రేమ విఫలం, లైంగిక దాడులపై ఫిర్యాదులు అందుతున్నాయంటే జిల్లాలో శాంతిభద్రతల పరిస్థితి ఎలా వుందో అర్థం చేసుకోవచ్చు. J

## చిత్తూరుకు కండ్లేరు జలాల తరలింపులో....

# రామనారాయణరెడ్డి పసలేని వాదన!

కండ్లేరు నుంచి చిత్తూరు జిల్లాలో తన నియోజకవర్గానికి నీళ్లు తీసుకవెళ్లడానికి ముఖ్యమంత్రి కిరణ్‌కుమార్‌రెడ్డి చేస్తున్న కుటిల ప్రయత్నం విషయంలో జిల్లా మంత్రి ఆనం రామనారాయణరెడ్డి పసలేని వాదన విన్పిస్తున్నాడు. కండ్లేరు రైతాంగం భవిష్యత్తును దారుణంగా దెబ్బ తీసే పథకం ఇది. కండ్లేరు క్రింద నెల్లూరు జిల్లాలో దాదాపు రెండున్నర లక్షల ఎకరాలు సాగు కావాల్సి వుంది. ఆ ప్రాంతమంతా కూడా నీటికి అలమటించే మెట్ట భూములు. వెంకటగిరి, రాపూరు, సూళ్లూరుపేట, గూడూరు తాలూకాలన్నీ దాని పైనే ఆధారపడి వున్నాయి. కండ్లేరులో స్వతహాగా నీరులేదు. కృష్ణ మిగులు నీటిని సోమశిలకు, అక్కడ నుంచి కండ్లేరుకు తరలించి ఈ మెట్ట పొలాల దాహం తీర్చాలని నల్లపరెడ్డి శ్రీనివాసులురెడ్డి, ఎన్టీరామారావు కలిసి ఎంతో దూరదృష్టితో రూపొందించిన రిజర్వాయర్ ఇది. అయితే దురదృష్టవశాత్తు గత పదిహేడేళ్లుగా కృష్ణ మిగులు నీళ్లు కండ్లేరుకు ప్రవహించడం లేదు. అందుకు సవాలక్ష కారణాలు. వెంకటగిరి, రాపూరు కొండల నుంచి క్రిందకు జాలువారే అరకొర వాననీరు మాత్రమే కండ్లేరు రిజర్వాయర్‌కు వస్తున్నది. ఆ కొంచెం నీటిని నాలుగైదేళ్లకొకసారి మాత్రమే రైతులు తమ పొలాలకు వాడుకోగల్గుతున్నారు.

ఈ నేపథ్యంలో కండ్లేరు నుంచి ఏకంగా ఆరు టిఎంసిల నీటిని చిత్తూరు జిల్లాకు తరలించుకపోయే కుట్ర పన్నుతున్నాడు ముఖ్యమంత్రి. అందుకోసం ఒక భారీ పైప్ లైన్ నిర్మాణం చేపట్టాడు. ఈ పైప్‌లైన్‌ను రిజర్వాయర్ అడుగు భాగంలో అమరుస్తున్నారు. దాని అర్థం రిజర్వాయర్‌లోని డెడ్ స్టోరేజ్ నీటిని దొంగిలించడం. డెడ్ స్టోరేజ నీరు తరలిస్తే, రైతులకు జరిగే అన్యాయం ఒకటైతే, రిజర్వాయర్ భద్రతే ముప్పులో పడుతుంది. ఈ దారుణమైన ద్రోహానికి ఆర్థిక మంత్రి హోదాలో అనుమతి మంజూరు చేశాడు రామనారాయణరెడ్డి. కండ్లేరు నీటి కోసం ఆమరణ నిరాహార దీక్ష చేసిన పెద్ద మనిషికి ఇది తగునా అని ప్రశ్నించింది 'జమీన్‌రైతు' పత్రిక. ఆ మాట ఆయనకు ఎక్కడలేని కోపం తెప్పించింది.

14వ తేది పొదలకూరులో జరిగిన రైతు సదస్సులో మాట్లాడుతూ ఒక పత్రిక నా మీద అభాండాలు వేసింది. నేను ఆ రోజు చేసిన ఆమరణ దీక్ష వల్లనే పొదలకూరుకు నీరు పారుతున్నది. మన ఇంటి ముందుకు వచ్చి గుక్కెడు నీరు అడిగితే మానవతా దృక్పథంతో దాహం తీరుస్తాము. చిత్తూరు జిల్లా ప్రజలు అదే అడిగారు. అందుకే దానికి అనుమతి ఇచ్చాను. నెల్లూరు జిల్లా రైతుల ప్రయోజనాలకు భంగం కలగకుండా కృష్ణ నుంచి మరిన్ని మిగులు జలాలు తెచ్చి రెండు జిల్లాల ప్రయోజనాలూ కాపాడుతాము... అన్నారు రామనారాయణ

కొరవ 14వ పేజీలో



జమీన్‌రైతులో వారఫలాల రచయిత అక్కరాజు బాలసుబ్రహ్మణ్యం కుమార్తె భార్గవి, గాలి వెంకట రామకృష్ణల వివాహం 11తేది ప్రకాశం జిల్లా అద్దంకిలోని మాధవస్వామి ఆలయంలో జరిగింది.



అస్వస్థతకు గురై ఆరు నెలల విరామం తర్వాత నెల్లూరు వచ్చిన రూరల్ ఎమ్మెల్యే ఆనం వివేకానందరెడ్డిని పరామర్శిస్తున్న రత్నం విద్యా సంస్థల అధినేత కెవి.రత్నం.

# రైతు సదస్సులు ప్రారంభం!



జిల్లాలో ఈ నెల 13 నుంచి రైతు సదస్సులు ప్రారంభమైనాయి. గత నెల 10వ తేదీ ప్రారంభమైన రైతు చైతన్య యాత్రలు ఈ నెల 10తో ముగిశాయి. మళ్లీ రైతు సదస్సులు నిర్వహించాలని ప్రభుత్వం ఆదేశించడంతో అధికారులు గ్రామాల బాట పట్టక తప్పలేదు. అసలే ఎండలు మండిపోతున్న సమయంలో నెల రోజుల పాటు రైతు చైతన్య యాత్రలు నిర్వహించిన అధికారులకు మళ్లీ రైతు సదస్సులు నిర్వహించాలని ఉత్తర్వులు అందడంతో ఎండలను తట్టుకుని కార్యక్రమాన్ని ఎలా నిర్వహించాలని చర్చించుకుంటున్నారు. రైతు చైతన్య యాత్రలు, రైతు సదస్సులకు పెద్దగా తేడా ఏమీ కనిపించడం లేదు. గ్రామాలకు వెళ్లి రైతులందరినీ ఒకచోట సమావేశ పరిచి అధిక దిగుబడులిచ్చే వరి విత్తనాల గురించి తెలియజెప్పడం దాని ఉద్దేశం. ప్రస్తుతం జిల్లాలో రెండవ వరి పంట వేసుకునేందుకు ఈ దఫా సోమశిల రిజర్వాయర్‌లో అవసరమైన నీటి లభ్యత లేకపోవడంతో ప్రభుత్వం అనుమతివ్వ

### ● స్పందన మాత్రం లేదు

లేదు. దీంతో రైతులు, వ్యవసాయ కూలీలు పనులు లేక ఇళ్ల వద్దనే వుంటున్నారు. ఈ నేపథ్యంలో రైతు సదస్సులు నిర్వహించాలని శ్రీకారం చుట్టారు. వ్యవసాయ, నీటిపారుదల, పశుసంవర్ధక, ఉద్యానవనం, తదితర శాఖ అధికారులు ఈ కార్యక్రమంలో పాల్గొంటున్నారు. ఈ కార్యక్రమం నిర్వహించడం ఏమేరకు రైతులకు అవగాహన కల్పిస్తారో వేచి చూడాల్సిందే.

### మూడు డివిజన్లలో సదస్సులు

ఈ నెల 13 నుంచి జిల్లాలో ప్రారంభమైన రెవిన్యూ సదస్సుల సందర్భంగా నెల్లూరు, కావలి, గూడూరు డివిజన్ కేంద్రాల్లో భారీ బహిరంగ సభలను ఏర్పాటు చేశారు. నెల్లూరు డివిజన్‌కు సంబంధించి పొదలకూరులో రెవిన్యూ సదస్సు ఏర్పాటు చేశారు. మిగిలిన రెండు డివిజన్లలో సదస్సు కార్యక్రమాలు ఖరారు కాలేదు.



నెల్లూరు పొగతోటలో న్యూ ఆధునిక్ ఆప్టికల్స్ షోరూంను ప్రారంభిస్తున్న మాదరన్ ఐ హాస్పిటల్ అధినేతలు డాక్టర్ పిఎల్.రావు, డాక్టర్ భారతి. ప్రక్కన షోరూం నిర్వాహకుడు సురేష్‌బాబు.



ప్రజాదీవెన కార్యక్రమంలో భాగంగా కావలి రూరల్ మండలం రాజువారి చింతలపాలెంలో ప్రజల సమస్యలు అడిగి తెలుసుకొంటున్న కావలి నియోజకవర్గ వైకాపా సమన్వయకర్త రామిరెడ్డి ప్రతాప్‌కుమార్‌రెడ్డి.




గతంలో వలె అనేక ఇబ్బందులకు గురౌతారు. ఇంట్లో వివాహాది శుభకార్యాలకు వస్తు, వస్త్ర అలంకారప్రాప్తి. తద్వారా రుణాలు చేయడం వల్ల మనస్సులో ఆందోళనున్నప్పటికీ అవసరాలు తీరు తాయి. విద్యార్థులకు అధిక శ్రమ. వ్యవసాయదారులకు తలపెట్టిన పనులపై పట్టుదల అవసరం. వృత్తి, వ్యాపార వ్యవహారాలలో సామాన్య ఆదాయాలుంటాయి.




భవిష్యత్తు గురించి చేసే ఆలోచనలు ఫలిస్తాయి. వృత్తి, వ్యాపారా లలో భాగస్వాములతో జాగ్రత్తలు తీసుకోవాలి. శరీరారోగ్య బాధలు తరచూ బాధిస్తాయి. అనుంగు మిత్రులు, బంధువులతో సఖ్యత అవసరం. స్థిరమైన ఆదాయం వున్నప్పటికీ, ఇష్టంలేని ప్రయాణాల వల్ల శరీరం అలసట, నిస్సత్తువ ఏర్పడుతుంది. అనుభవ రాహిత్యం వల్ల కొన్ని వ్యవహారాలలో ప్రతిష్టంభన ఏర్పడుతుంది.




వృత్తి, వ్యాపారాలలో మార్పులున్నాయి. అపూర్వ ధైర్యసాహసాలు ప్రదర్శిస్తారు. విద్యార్థులు చేసే కృషికి పలు ఆటంకాలు ఏర్పడుతాయి. వ్యవసాయ, కళా, క్రీడాకారులు, ఉద్యోగులకు ప్రమోషన్లు లేదా స్థాన మార్పులున్నాయి. కొందరికి ఆశాభంగం వుంటుంది. రాజకీయుల ప్రయత్నాలకు పలు ఆటంకాలు, విఘ్నాలు కలుగుతాయి. మొత్తా నికి ఈ రాశివారు మంచిమాటలతో ఇతరులను ఆకట్టుకోవాలి.




ఇంటాబయట సుఖశాంతులు, వివాహాది శుభకార్యాలలో బంధు మిత్రులతో పాల్గొంటారు. విద్యార్థులకు శ్రమకు తగిన ఫలితం. ఇష్ట కార్యసిద్ధి. ప్రముఖుల నుండి సహాయసహకారాలు పొందుతారు. వృత్తి, వ్యాపార, ఉద్యోగాలలోని వారికి ఆర్థిక పుష్టి. లాభాలు పొంద గలరు. వ్యవసాయం, కళా, క్రీడలలోని వారికి శ్రమకు తగిన ఫలితం వుంటుంది. రాజకీయులు అనవసర విషయాల జోలికి పోవద్దు.




గ్రహబలం తక్కువగా వుండడం వల్ల ఉద్యోగులకు స్థానహాని, కష్టతర బాధ్యతలు తీసుకొనుట. వృత్తి, వ్యాపారులకు అన్నింటా మిశ్రమ ఫలి తాలు. మనోవ్యాకులం. విద్యార్థుల దీక్షాదక్షతలకు పరీక్ష. వ్యవసాయ దారులకు ఆదాయం బాగున్నా ఖర్చులుంటాయి. కళా, క్రీడాకారులకు వృత్తిలో అయిష్టలు లేదా అనాసక్తి వుంటుంది. రాజకీయులకు ద్రవ్య హాని, అనవసర ప్రసంగాలు, మిశ్రమ ఫలితాలుంటాయి.




నూతన కార్యాలకు లేదా వ్యాపారాలకు చేసే ఆలోచనలు కలిసిరావు. అకారణంగా అపవాదులు, కుటుంబంలో లేదా బంధుమిత్రులతో భేదాభిప్రాయాలు. ఇతర ప్రదేశాలలో అయిష్టంగా నివసించాల్సి రావ డం, శరీరారోగ్య లోపాలు బాధిస్తాయి. విద్యార్థులు శ్రమ శిక్షణతో ముందుకు సాగాలి. వ్యవసాయదారులకు కాస్త నిరాశ కలుగు తుంది. రాజకీయుల ఆలోచనా విధానంలో మార్పు రావాలి.

# వారఫలాలు

*తేది 18-5-2013 నుండి 24-5-2013 వరకు మేషంలో కేతువు, 24తేది వరకు కుజుడు తదుపరి వృషభంలో; వృషభంలో బుధ, గురు, రవి, శుక్రులు; తులలో శని, రాహువులు; సింహ, కన్య, తులలలో చంద్రుడు సంచరిస్తారు.*

## పంచాంగం

21తేది మత్రత్రయ ఏకాదశి. రమా సహిత శ్రీ సత్యనారాయణస్వామి కళ్యాణం.
22తేది పరశురామ ద్వాదశి.
23తేది శ్రీ నృశింహ జయంతి.

### శుభ ముహూర్తాలు

20, 21, 22తేదీలలో అక్షరాభ్యాస, ఊయల, గర్భదాన, సీమంత, అన్నప్రాసన, ఉపనయన, వివాహాది శుభ కార్యక్రమాలకు శుభ ముహూర్తాలున్నాయి.

### మే తిథులు
### వైశాఖ శుద్ధ

| | | | | |
|---|---|---|---|---|
| 18 | శని | అష్టమి | రా | 10.28 గం.ల.వ |
| 19 | ఆది | నవమి | రా | 10.46 గం.ల.వ |
| 20 | సోమ | దశమి | రా | 10.16 గం.ల.వ |
| 21 | మంగళ | ఏకాదశి | రా | 09.01 గం.ల.వ |
| 22 | బుధ | ద్వాదశి | సా | 07.02 గం.ల.వ |
| 23 | గురు | త్రయోదశి | సా | 04.26 గం.ల.వ |
| 24 | శుక్ర | చతుర్దశి | ప | 01.20 గం.ల.వ |

**అక్కరాజు బాలసుబ్రహ్మణ్యం**
7/34, దొడ్ల సుబ్బారెడ్డి నగర్, నవలాకులతోట, నెల్లూరు - 2. సెల్: 95819 76599.




గతవారం కన్నా మేలుగా వుంటుంది. శుభకార్యాల నిమిత్తం వస్తు, వస్త్రాభరణాల ప్రాప్తి. బంధుమిత్రుల సమాగమం. ఆధ్యాత్మిక వ్యక్తుల దర్శన లాభం. ఉద్యోగులకు స్థానమార్పులు, స్త్రీలకు నూతన అలంకార వస్తు సేకరణ, వ్యవసాయం ఆశాజనకం. వృత్తి, వ్యాపా రాలలో మిశ్రమ లాభాలు. విద్యార్థులకు శ్రమానంతర ఫలితాలు. కళా, క్రీడాకారులకు అనుకొన్న పనులలో విజయం.




వృత్తి, వ్యాపారులకు వ్యాపారపరమైన ఇబ్బందులుంటాయి. ఆదాయ, వ్యయాలకు పొంతన వుండదు. మనోధైర్యం సన్నగిల్లుతుంది. విద్యా ర్థులకు కొంత అర్థంకాని పరిస్థితులుంటాయి. వీరికి అధికశ్రమ అవ సరం. వ్యవసాయదారులకు కష్టే ఫలి అన్నట్లుంది. కళా, క్రీడాకారు లకు వృత్తిపరమైన ఇబ్బందులు, ఆర్థిక నష్టం, అధికశ్రమ. రాజకీ యులు కోపం తగ్గించుకొని జాగ్రత్తగా వ్యవహరించాలి.




వృత్తి, వ్యాపార, ఉద్యోగాలలోని వారికి ముఖ్య మార్పులు గోచరిస్తు న్నాయి. స్థాన చలనం, బంధువర్గాల వారికి అనారోగ్యం, ఆందో ళన కలిగిస్తుంది. కోర్టు వ్యవహారాలలో అనుకూలత. తొందరపడి మాట జారవద్దు తద్వారా కష్టనష్టాలుంటాయి. వ్యవసాయదారు లకు సామాన్య ఫలితాలు. విద్యార్థులకు ఆందోళన, వ్యయప్రయా సలు. కళా, క్రీడా రంగాలలోని వారికి మాట తొందర పనికిరాదు.




తలపెట్టిన పనులలో అనుకూల పరిస్థితులు. వృత్తి, వ్యాపారాల లోని వారికి ఆర్థికాదాయాలు, శరీరారోగ్య లోపాలు, ఉద్యోగులకు స్థానమార్పులు, విశ్రాంతి లేకుండడం, అనవసర ప్రయాణాల వల్ల చిరాకు ఏర్పడుతాయి. వ్యవసాయదారులకు దీక్షాదక్షతలు అవస రం, శ్రమానంతర ఫలితాలుంటాయి. విద్యార్థులకు మిశ్రమంగా వుం టుంది. ముందు చూపు అవసరం. రాజకీయులకు అనుకూలం.




వృత్తి, వ్యాపారాలలో సామాన్య లాభాలు. విష జంతువులచే బాధలు. కుటుంబ అవసరాలకు ధన వ్యయం. ఉద్యోగులకు దూరప్రాంత బదిలీలు, ఆదాయ వ్యయాలలో పొంతనుండదు. వ్యవసాయదారు లకు పంటలపై తగు జాగ్రత్తలు అవసరం. కళా, క్రీడా రంగాలలోని వారికి అధికారులతో భేదాలు. రాజకీయులకు క్రిందిస్థాయి వారితో మాట పట్టింపులు, అధికార భయం. అధిక ధన వ్యయం.




చేసే పనులలో సందిగ్ధత వల్ల కంగారుగా వుంటుంది. శరీరారోగ్య లోపాలు, ముఖ్యంగా శిరోసంబంధ రోగాలు బాధిస్తాయి. ఆధ్యా త్మిక, సాంఘిక కార్యక్రమాలలో పాల్గొంటారు. ఇతరులకు ఆర్థిక సాయం చేసినా మాటపడవలసి వస్తుంది. విద్యార్థులకు భవిష్యత్ భయం కలిగినా లెక్కించక ముందుకుపోతారు. వృత్తి, వ్యాపారాలు పర్వాలేదని పిస్తాయి. వ్యవసాయదారులకు ఆర్థికాదాయం.

# యంత్రం తిరుగులేని పాశుపతాస్త్రం!

## వాస్తు సందేహాలు సమాధానాలు

**ఆచార్య సుబ్రహ్మణ్య మహర్షి**
4వ వీధి, గాయత్రినగర్, ఎ.కె. నగర్ పోస్టు, నెల్లూరు-4.
ఫోన్: 2322345, సెల్: 9490125878.

*టి.సాయివిశ్వసుందరి — విశాఖపట్నం*

* *యంత్ర ప్రతిష్ట తర్వాత ఆయన పూర్తిగా మారారు. కృతజ్ఞతలు.*

విశ్వామిత్ర వాస్తు అంటుంది కదా ఏ మంత్రాలు తంత్రాలూ పనిచేయనప్పుడే ఆఖరి అస్త్రం 'యంత్రం'. ఇది తిరుగులేని పాశుపతాస్త్రం లాంటిది.

*ఫ్రాంక్లిన్ సుధాకర్ — నెల్లూరు*

* *వధూవరుల ఎంపికలో జ్యోతిష శాస్త్రంపై ఆధారపడమంటారా?*

శాస్త్రజ్ఞుడిగా నేను ఎవరినీ ఆదేశించలేదు. అది వారి ఇష్టం. అయితే కుటుంబాల సంస్కారం, వధూ వరులు ఒకరినొకరు ఇష్టపడడం చాలా ముఖ్య మైన అంశం. జ్యోతిష శాస్త్రాన్ని పాటించదానికి నిష్ణాతులైన శాస్త్రజ్ఞుల్ని మాత్రమే సంప్రదించండి.

*టి.లావణ్య — కొడవలూరు*

* *'మంగళ'వారమని నిర్లక్ష్యం చేస్తే ప్రాణాల మీదికొచ్చింది.*

అత్యవసరమైన సమయాల్లో ఛాందసాల్ని వదలి పెట్టాలి. మంగళ అంటే శుభకరమైన, శుభ ప్రదమైనదని అర్థం.

*ఎం.తాతారావు — కర్నూలు*

* *పూర్వ ఫల్గుణి, ఉత్తర ఫల్గుణి నక్షత్రాలను గురించి చెప్పండి?*

పూర్వ ఫల్గుణిని పుబ్బ అని, ఉత్తర ఫల్గుణిని ఉత్తర నక్షత్రాలుగా శాస్త్రం పరిగణిస్తున్నది.

*డాక్టర్ పరిపూర్ణశాస్త్రి — బెంగుళూరు*

* *మేష వృశ్చికాలు షష్టాంకములు కదా వివాహం చేయవచ్చునా?*

రెండింటికీ రాశి అధిపతి కుజుడయినందు వల్ల పై రాశులకు దోషం లేదు. వివాహం జరిపించ వచ్చు.

*ఎం.సుందరాచార్యులు — తిరుపతి*

* *సూర్యునకు, కేతువుకు, చంద్రునకు ఉచ్ఛ (శ్రేష్ఠ) రాశులేవి?*

సూర్యునకు మేషం, చంద్రునకు వృషభం, కేతువుకు వృశ్చికం ఉచ్ఛ రాశులు.

*పిఎంఆర్ — పడుగుపాడు*

* *చివరి రోజులొచ్చాయేమో అనిపిస్తున్నది.*

భగవన్నామస్మరణ చేసే మీకిలాంటి బేలతనం పనికిరాదు.యంత్ర, కుంభ ప్రతిష్టలు చేశాక మీకేమీ కాదు. నేను మీకు భరోసా యిస్తున్నాను.

*ఎన్.అనూరాధ — శ్రీకాళహస్తి*

* *ఉపనయనం అబ్బాయికి ఎప్పుడు చేయించమంటారు? ఏ లగ్నంలో, ఏ గ్రహాలుంటే మంచిది?*

వటువు(అబ్బాయి) ఉపనయన లగ్నంలో బృహస్పతి(గురువు), శుక్రుడు ఉన్నట్లయితే అతను విద్యావంతుడై గృహస్థు కాగలడు.

*వై.జానకి — దామరమడుగు*

* *ఇంట్లోవాస్తు దోషాలేమీ లేవని చెప్పారు. అయితే సమస్యలు ఎందువల్ల?*

ప్లాను ప్రకారం దిక్కులు పెరిగాయి. ద్వారాల క్రమం బాగోలేదు. వీధి చూపయినా దృష్టి దోషం వుంది. ఈ కారణాల వల్ల మీకు సమస్యలు వస్తు న్నాయి.

*డాక్టర్ సుబ్రమణియన్ — చెన్నై*

* *వాస్తు గ్రంథాలలో తలా ఒక విధంగా చెప్పారు*

ప్రాచీన ఇరవై ఎనిమిది వాస్తు గ్రంథాల ఆంగ్ల అనువాదాలు చాలా వున్నాయి. మీరు ఆధు నిక గ్రంథాల్ని ఓ మూల పెట్టేసి వాటిని చదివే ప్రయత్నం చేయండి.

*ఎం.ఉమ — కర్నూలు*

* *యంత్ర ప్రతిష్ట వల్ల లాభలేమిటి?*

వాస్తు దోషాల్ని పరిహరించి గృహ నిర్మాణం ఆలస్యమయినపుడు రక్షణ కవచంలా యంత్రం పని చేస్తుంది. గృహంలోని వ్యక్తుల సమస్యల్ని కూడా తగ్గిస్తుంది.

*డి.విలియమ్స్ — నెల్లూరు*

* *ఆగ్నేయం, వాయువ్యాలలోనే వంట గదులు నిర్మించాలా?*

ఆగ్నేయానికి ప్రత్యామ్నాయం వాయువ్యం. ఈ దిక్కులపై గాలి ఒత్తిడి ఎక్కువగా వుంటుంది. అందువల్ల కలుషిత గాలి బయటికి వెళ్లిపోయి స్త్రీలు ఆరోగ్యంగా వుంటారు. ఈ సిద్ధాంతమే వంట గదుల నిర్మాణానికి కారణం.

# పచ్చతోరణం పథకం అమలుకు కసరత్తు!

**జూన్ నెల నుంచి జిల్లాలో పచ్చతోరణం పథకం ప్రారంభించేను అధికారులు సన్నాహాలు మొదలు పెట్టారు. బంజరు భూములను గుర్తించడం, చెరువు, కాలువగట్లపై మొక్కలు నాటడం ఈ పథకం ముఖ్య ఉద్దేశం.**

జిల్లాలో "పచ్చతోరణం" పథకం అమలుకు అధికారులు కసరత్తు ప్రారంభించారు. గత వారంలో రాష్ట్ర ప్రభుత్వ ప్రధాన కార్యదర్శి మహంతి వీడియో కాన్ఫరెన్స్ ద్వారా అధికారులతో సమీక్ష జరిపి పచ్చతోరణం పథకం అమలుచేసే విధానాలపై వివరించడం జరిగింది. ప్రధానంగా బంజరు భూములు గుర్తించడం, చెరువు, కాలువగట్లపైన మొక్కలు నాటడం ఈ పథకం ముఖ్యఉద్దేశం. మొక్కలు నాటే కార్యక్రమానికి ఇందిరమ్మ పచ్చతోరణం అనే పేరును రాష్ట్ర ప్రభుత్వం ఖరారు చేసింది. ఇందిరమ్మ కలల పథకంలో భాగంగా 9 రకాల రేషన్ సరుకులకు అమ్మ హస్తం. ఎస్సీ, ఎస్టీ ఉప ప్రణాళిక చట్టం పేర్లను నిర్ణయించిన సంగతి తెలిసిందే. కిరణ్‌కుమార్‌రెడ్డి రాష్ట్ర ముఖ్యమంత్రిగా బాధ్యతలు చేపట్టిన రెండేళ్లలో తొలి సారిగా నిరుద్యోగులకు ప్రైవేటు కంపెనీల్లో ఉపాధి అవకాశాలు కల్పించాలన్న సంకల్పంతో రాజీవ్ యువ కిరణాల పథకాన్ని ప్రారంభించడం జరిగింది.

ఈ సంవత్సరం అమ్మహస్తం, ఎస్సీ, ఎస్టీ ఉప ప్రణాళిక చట్టంతోపాటు అంగన్‌వాడి కేంద్రాల్లో చిన్నారులు, గర్భిణీలకు మధ్యాహ్న భోజనం సరఫరా చేసేందుకు ఇందిరమ్మ అమృతహస్తంను ప్రవేశపెట్టారు. సంక్షేమ పథకాల అమలుకు నిధుల కొరత ఉన్నప్పటికి దీనిని అధికమించి నిధులు సమకూర్చుతామని సిఎం ప్రకటిస్తున్నారు. తాజాగా ఇందిరమ్మ పచ్చతోరణం పథకం జూన్ నెల నుంచి అమలు చేయాలని ప్రభుత్వం ఆదేశించింది. ఈ కార్యక్రమాన్ని అమలుచేసే బాధ్యతను ఏ శాఖ చేపట్టాలన్న దానిపై స్పష్టమైన మార్గదర్శకాలు జారీకాలేదని అధికారులు చెబుతున్నారు. కాని అధికార యంత్రాంగం ముందస్తు చర్యలు చేపట్టే పనిలో నిమగ్నమైంది. ప్రధానంగా బంజరు భూముల వివరాలు సేకరించేందుకు సర్వేయర్లను సమాయత్తమౌతున్నారు. చెరువులు, కాలువగట్లపై మొక్కలు నాటే కార్యక్రమాన్ని నీటిపారుదలశాఖకు అప్పగించే అవకాశం వుందని అధికారులు భావిస్తున్నారు.

గతంలో జిల్లాలో మొక్కలు నాటే కార్యక్రమం అటవీశాఖ ఆధ్వర్యంలో జరిగేది. ఈ శాఖ పరిధిలో వున్న సామాజిక వనవిభాగం అధికారులు మొక్కలు నాటి పెంచేవారు. అయితే రహదారుల ప్రక్కన మొక్కలు నాటిన అనంతరం వీటి నిర్వహణ బాధ్యతలను కొంతమేర విస్మరించారు. మొక్కల ఎదుగుదలకు సక్రమంగా ప్రతిరోజు నీటిని పోసేవారు కాదు. దీంతో నాటిన కొద్దిరోజులకు మొక్కలు ఎండిపోయేవి. కొన్ని మొక్కలు బాగా పెరిగిన తర్వాత ఇతరులతోపాటు విద్యుత్ తీగలకు అడ్డంగా వున్నాయన్న కారణంతో నరికి వేసేవారు. సంబంధితశాఖ అనుమతి లేకుండా చెట్లను నరికివేయడం నేరంగా భావిస్తారు. అటవీశాఖ అధికారులు ఈ విషయంలో ఉదాసీనత వైఖరి అవలంభించారన్న ఆరోపణలు మూటగట్టుకున్నారు. కోట్ల రూపాయల వ్యయంచేసి మొక్కలు నాటినప్పటికి వీటిని సంరక్షించడంలో పూర్తిగా విఫలం చెందారు. నెల్లూరు నగరంతోపాటు వివిధ ప్రాంతాల్లో రోడ్ల విస్తరణ భాగంగా రహదారికి ఇరువైపుల వున్న చెట్లను సైతం తొలగించేశారు.

జూన్ నెల నుంచి ఇందిరమ్మ పచ్చతోరణం పేరుతో మొక్కలు నాటే కార్యక్రమాన్ని ప్రారంభిస్తారు. ఈ దఫా ప్రధానంగా బంజరు భూములపై ప్రత్యేక దృష్టిసారిస్తారు. ప్రభుత్వ ప్రధాన కార్యదర్శి జిల్లా కలెక్టర్, ఇతర శాఖల అధికారులతో నిర్వహించిన వీడియో కాన్ఫరెన్స్‌లో కూడా బంజరు భూములు, చెరువులు కాలువగట్ల గురించి ప్రస్తావించారు. జిల్లా వ్యాప్తంగా ఎన్ని వేల ఎకరాలు బంజరు భూములున్నాయి? అలాగే చెరువు, కాల్వగట్లు ఎన్ని వున్నాయి? అన్ని వివరాలు ముందుగా సేకరించి ప్రభుత్వానికి నివేదించాల్సి వుంటుంది. అధికారులు వివరాలు సేకరించిన అనంతరం ప్రభుత్వం నుంచి మార్గదర్శకాలు జారీ అవుతాయని భావిస్తున్నారు. ప్రతిష్టాత్మకంగా ఇందిరమ్మ పచ్చతోరణం పథకాన్ని అమలు చేయాలని అధికారుల్ని ఆదేశించడంతో ఆ దిశగా ప్రణాళికలు సిద్ధం చేస్తున్నారు. సామాజిక వన విభాగంపై అనేక ఆరోపణలుండడంతో పచ్చతోరణం పథకాన్ని వేరే శాఖకు అప్పగించనున్నట్లు సమాచారం. మొక్కలు నాటే కార్యక్రమం ద్వారా ఎస్సీ, ఎస్టీలకు ఉపాధి అవకాశాలు కల్పిస్తారు.

ప్రస్తుతం జిల్లాలో రెండవ పంటకు విరామం ప్రకటించడంతో వ్యవసాయ పనులు లేక గ్రామాల్లోని ప్రజలు ఇళ్ల వద్దే వున్నారు. వీరిని ఆయా గ్రామాల పరిధిలో మొక్కలు నాటే కార్యక్రమానికి వినియోగించనున్నారు. రాష్ట్ర ప్రభుత్వం ప్రతిష్టాత్మకంగా అమలు చేయాలని నిర్ణయించిన ఈ కార్యక్రమాన్ని జిల్లా యంత్రాంగం విజయవంతంగా పూర్తిచేయాలని ఆశిద్దాం.

**ఇదేం పద్ధతి?**

# జిల్లా వైద్య ఆరోగ్య శాఖ కార్యాలయంలో ఇష్టులకు క్యాంటిన్!

> "నెల్లూరులోని వైద్య ఆరోగ్య శాఖ కార్యాలయంలో ఓ ప్రైవేటు వ్యక్తి క్యాంటిన్ ఏర్పాటు చేసుకొన్నాడు. కానీ ఇతని వద్ద ఒక్క రూపాయి కూడా డిపాజిట్‌గా వసూలు చేయలేదు. బాడుగ చెల్లించడం లేదు. పైపెచ్చు కరెంటు బిల్లు సైతం వైద్య ఆరోగ్య శాఖనే కట్టడం విడ్డూరమనిపిస్తుంది."



డిఎంఅండ్‌హెచ్‌ఓ ఆఫీసులో నిబంధనలకు విరుద్ధంగా ఏర్పాటుచేసిన క్యాంటిన్.

వైద్య, ఆరోగ్యశాఖాధికారి నిర్లక్ష్యం, ఉదాసీనత కారణంగా ఆశాఖకు రావాల్సిన ఆదాయానికి గండి పడింది. క్యాంటిన్ నిర్వాహకులతో కుమ్మక్కయ్యారో లేదో తెలియదు గాని, క్యాంటిన్ ఏర్పాటుకు భవనం, ఉచితంగా విద్యుత్ అందిస్తున్నారు. సేకరించిన సమాచారం మేరకు జిల్లా వైద్యఆరోగ్యశాఖ కార్యాలయంలో ప్రైవేటు వ్యక్తి క్యాంటిన్ ఏర్పాటు చేశాడు. రోజుకు వెయ్యి నుంచి రెండు వేల రూపాయల వరకు క్యాంటిన్ వ్యాపారం జరుగుతుంది. కాని ఒక్కపైసా కూడా నిర్వాహకుడి నుంచి ఈ శాఖాధికారి వసూలు చేయడం లేదు. దీనికి తోడు కరెంటు బిల్లులను కూడా ఈ శాఖ నిధుల నుంచి చెల్లిస్తున్నారు.

ప్రభుత్వ నిబంధనల ప్రకారం ఏదైనా కార్యాలయంలో క్యాంటిన్ ఏర్పాటు చేయాలని అధికారులు భావిస్తే ఆ శాఖ ఉన్నతాధికారులకు ముందుగా నివేదించాలి. వారి నుంచి అనుమతి లభించిన తర్వాత క్యాంటిన్ ఏర్పాటు కోసం టెండర్లను పిలవాల్సి వుంటుంది. టెండర్లను పరిశీలించి, నిబంధనల ప్రకారం ఖరారు చేయాలి. అయితే ఇక్కడ ఎటువంటి నిబంధనలు పాటించిన దాఖలాలు కనిపించడం లేదు. ఉన్నతాధికారుల అనుమతి లేకుండానే సొంతంగా నిర్ణయం తీసుకొని ఓ వ్యక్తికి క్యాంటిన్ ఏర్పాటు కోసం అనుమతిచ్చారు. టెండర్లను పిలిచి వుంటే గట్టి పోటీ ఏర్పడి ఆ శాఖకు భారీగానే ఆదాయం సమకూరి వుండేది. కార్యాలయ ఆవరణలోనే వున్న క్యాంటిన్‌లో టీ, టిఫిన్, కూల్‌డ్రింక్స్ ఇతర ఆహార పదార్థాలను విక్రయిస్తున్నారు.

కార్యాలయ సిబ్బందితోపాటు బయట పిహెచ్‌సిల నుంచి వచ్చే సిబ్బంది ఇదే ఆవరణలో వున్న విక్రమసింహపురి యూనివర్శిటీ హాస్టల్ విద్యార్థులు సైతం క్యాంటిన్‌లో వివిధ రకాల పదార్థాలు కొనుగోలు చేస్తుంటారు. రాబడి బాగానే వున్నా అద్దె మాత్రం చెల్లించడం లేదు. ప్రైవేటు వ్యక్తికి క్యాంటిన్ ఏర్పాటుకు భవనం కేటాయించడంలో కార్యాలయంలో పని చేసే ఓ ఉద్యోగి కీలక పాత్ర పోషించినట్లు ఈశాఖ జిల్లా అధికారి అధికారిక నివాసంగా వుండే బంగ్లాను కూడా క్యాంటిన్ నిర్వాహకుడికి అప్పగించడం మరో విశేషంగా చెప్పవచ్చు. అధికారి నివాసం వుండేందుకు అనువుగా లేదన్న కారణంతో దానిని నిరుపయోగంగా వుంచారు. క్యాంటిన్ ఏర్పాటు చేసిన తర్వాత బంగ్లాలో నివాసం వుండేందుకు అనుమతివ్వడం పట్ల ఆరోపణలు, విమర్శలు వినిపిస్తున్నాయి.

ఈ నెలాఖరుకు పదవీ విరమణ చేయనున్న సదరు అధికారి సిబ్బంది డిప్యూటేషన్‌పై నియమించడంలో ఇష్టానుసారంగా వ్యవహరించారని ఆ శాఖ ఉద్యోగులే బహిరంగంగా వ్యాఖ్యానిస్తున్నారు. ఈ అధికారిపై ఎన్ని ఆరోపణలు, విమర్శలు వచ్చినప్పటికి జిల్లా కలెక్టర్‌తోపాటు ఆ శాఖ ఉన్నతాధికారులు సైతం పట్టించుకోని పరిస్థితి.

అధికార పార్టీ నేతల సహకారంతో జిల్లా వైద్య, ఆరోగ్యశాఖాధికారిగా నియమితులు కావడం ఇందుకు కారణంగా పేర్కొనవచ్చు. బాధ్యతలు చేపట్టిన తర్వాత ఈ అధికారి స్వయంగా జిల్లా మంత్రికి కృతజ్ఞతలు తెలుపుతూ మీడియాలో ప్రకటించిన సంగతి గుర్తు చేసుకోవాలి. మంత్రి అండతో ఈ పదవిలోకి వచ్చిన వ్యక్తి నిబంధనలు ఉల్లంఘించినా ఎవరూ పట్టించుకోరన్న విషయం అందరికి తెలిసిందే. వీరి అండతో ప్రధానంగా సిబ్బందిని ఒక ప్రాంతం నుంచి మరో ప్రాంతానికి డిప్యూటేషన్‌పై నియమించారన్న ప్రచారం వుంది. సిబ్బంది కొరత వున్న ఆరోగ్యకేంద్రం నుంచి కూడా మరో పిహెచ్‌సికి పంపారు. ఆరోగ్య సేవలు అందించేందుకు అవసరమైన సిబ్బంది లేకపోవడంతో రోగులు అనేక ఇక్కట్లు పడుతున్నారు. తనిఖీల పేరుతో వైద్యులు, సిబ్బందిని భయపెట్టడం తప్ప శాఖను ప్రక్షాళన చేసేందుకు ఏ ప్రయత్నం చేయలేదు. నగరంలో వున్న ఆశాఖ కార్యాలయ ఆవరణలో క్యాంటిన్ ఇతరులకు అప్పగించి, విద్యుత్ బిల్లును సైతం ఆ శాఖ నుంచి చెల్లిస్తుండడంపై జిల్లా కలెక్టర్ స్పందించాల్సి వుంది.

# నిజాయితీలేని ప్రియుడు

కత్రినాకైఫ్ – రణబీర్‌సింగ్‌ల మధ్య డేటింగ్ పాత విషయమే కావచ్చు. కాని ఏ విషయంలోనైనా ఖచ్చితమైన కమిట్‌మెంట్ ఉండాలంటుంది కత్రినాకైఫ్. ఈ విషయమై ఆమె మాట్లాడుతూ లవ్ చేస్తే సిన్సియర్‌గా లవ్ చేయాలి. విడిపోతే సిన్సియర్‌గా విడిపోవాలంటోంది. మొన్నటివరకూ లవ్ ఐటెం సాంగ్‌తో తెగ పాడేసిన భామ కాస్తా ఇలా నిస్తేజంగా మాట్లాడుతోందేమిటి చెప్మా? ఎందుకంటే రణబీర్‌సింగ్‌కు కమిట్‌మెంట్ లేదట. ఎప్పుడూ ఏ అమ్మాయితో తిరుగుతాడో తెలీదు. ఎవరికి అపాయింట్‌మెంట్ ఇస్తాడో తెలీదు. ఫోన్‌లో గంటల తరబడి మాట్లాడుతాడు. ఎవరితో మాట్లాడుతాడో తెలీదు అంటూ వాపోతోంది. కొన్నాళ్లపాటు ముంబైకీ న్యూయార్క్‌కీ మధ్య ... కత్రినా సినిమా షూటింగ్ ఎక్కడ జరిగితే అక్కడికి డైలీపాస్ తీసుకొని మరీ చక్కర్లు కొట్టిన రణ్‌బీర్‌సింగ్ ఇప్పుడు కత్రినా మొబైల్ ఆన్సర్ చేయడం లేదట. మెసేజ్‌లు పట్టించుకోవడం లేదట. మెయిల్ బాక్స్ ఓపెన్ చేయడం లేదట.



## కంగనా వంటావార్పు!

పారిస్‌కు షూటింగ్‌కు వెళ్లి అక్కడి పిజ్జాలు, బర్గర్లు తినలేక చచ్చారట వికాస్ బెహల్ యూనిట్ సభ్యులు. మొత్తానికి భారతీయ భోజనం లేక నకనకలాడిపోయిన యూనిట్ సభ్యులను చూసిన హీరోయిన్ కంగనా మార్కెట్ నుంచి వస్తువులు పట్టుకొస్తే రుచికరమైన వంట వండి పెడతానందట. అంతే పదుల సంఖ్యలోని సభ్యులు ఆ చోటూ ఈ చోటూ తిరిగి వెతికి మరీ వస్తువులు తెచ్చారట. దీంతో కంగనా హాట్‌హాట్ బిందీ మసాలా – దాల్ తడ్కా చేసిందట. యూనిట్ సభ్యులంతా లొట్టలు వేసుకొంటూ మరీ భుజించి బ్రేవ్‌మని త్రేన్చేశారట. అక్కడ ఉన్నన్నాళ్లు కంగనా చేతివంట రుచి చూసిన యూనిట్ సభ్యులు, ప్లస్ వికాస్ బెహల్ ఆమెను తెగ మెచ్చుకొన్నారట. షూటింగ్ జరిగినన్ని నాళ్లు సాయంత్రం ఐదుగంటలకు ఆమె చేసి ఇచ్చిన అద్రక్‌ఛాయ్(అల్లం టీ) మరచిపోలేకపోతున్నారట.

## ప్రియుడ్ని బెదిరిస్తున్న బిపాస!




మాజీ ప్రియురాలు బిపాసబసు తనపై దుష్ప్రచారం చేస్తోందని బాధ వెళ్లగక్కుతున్నాడు జాన్ అబ్రహాం. ప్రేమించుకున్నన్నాళ్లూ ప్రేమించుకొని, కొన్నాళ్లు విడిపోయి, మళ్లీ కలుసుకొని – ఇలా బిపాస – జాన్ అబ్రహాం చేయని లవ్ ఫీట్ లేదు. ఇక ఇప్పుడు పూర్తిస్థాయిలో విడిపోదామని నిర్ణయించుకున్న తర్వాత బిపాస ఇలా చేయడం తగని పనంటున్నాడు జాన్. బిపాస – జోష్ హార్డ్‌నెట్ అనే ఫ్రెండ్‌తో తిరిగేస్తోంటే... జాన్ కూడా ప్రియారంచల్ అనే అమ్మాయితో తిరుగుతున్నాడు. ఇరువురి మనసుల్లో ఎక్కడో అభద్రతా భావం తొంగి చూడడంతో ఇలా లేనిపోని మాటలు తూలడం జాన్‌కు నచ్చడం లేదు. నా ఏడుపేదో నేను ఏడ్చా... నీ ఏడుపేదో నువ్వు ఏడువ్ అంటూ ప్రత్యక్షంగానూ పరోక్షంగానూ బిపాసకు చెప్పినా అర్థం చేసుకోవడం లేదు. తన జీవితం బాగుండాలని మొక్కని దేవుడు లేడు. ఇకనైనా నన్నువదలి పెట్టమని ప్రార్థిస్తున్నా అంటున్నాడు జాన్. జాన్‌ను ఇబ్బంది పెట్టేందుకే బిపాస మీడియాను వాడుకొంటున్నట్లు భోగట్టా.

## ఐటమ్‌పాటలో అంజలి!



ఆజ్ఞాతంలోకి వెళ్లి పిన్నిపై ఆరోపణలు చేసి సంచలనం రేపిన కథానాయిక అంజలి. ఈ భామ ప్రస్తుతం వెంకటేష్‌తో బోల్‌బచ్చన్ రీమేక్‌లో నటిస్తోంది. త్వరలో సూర్యతో కలసి ఆడిపాడబోతోంది. అయితే హీరోయిన్‌గా కాదు. ఐటెంగాళ్‌గా... ప్రస్తుతం సూర్య సింగమ్–2లో నటిస్తున్నాడు. అనుష్క, హన్సిక హీరోయిన్లు. హరి దర్శకుడు. ఇందులో ఐటమ్‌పాటలో నర్తించేందుకు అంజలి అంగీకారం తెలిపింది. ఆకర్షణీయమైన పారితోషికం ఇస్తున్నట్లు చెన్నై వర్గాలు చెబుతున్నాయి.

## కష్టం తెలిసొచ్చింది!



యువ హీరోయిన్ ఐశ్వర్య ఎవరో కాదు యాక్షన్ కింగ్‌గా పేరుతెచ్చుకొన్న అర్జున్ కుమార్తె. ఇప్పుడు హీరోయిన్‌గా ఎంట్రీ ఇస్తోంది. విశాల్‌కు జోడిగా ఓ సినిమాలో నటిస్తోంది. ఇటీవల షూటింగ్‌లో ఎండ వేడికి తట్టుకోలేక ఆమె కళ్లు తిరిగి పడిపోయింది. వెంటనే ఆమెను సమీప ఆసుపత్రిలో చేర్పించారు. ప్రాథమిక చికిత్స అనంతరం ఇంటికి పంపించేశారు. మళ్లీ షూటింగ్‌కు విచ్చేసిన ఐశ్వర్య సినిమా వాళ్లంటే సకల సౌకర్యాలు అనుభవిస్తారన్న అభిప్రాయం ఉంది. మండే ఎండల్లో, షూటింగ్‌లో పాల్గొనాలి. రిస్కీ పోరాటాలు, చావు బతుకుల మధ్య సాహసాలు చేయాలని ప్రత్యక్షంగా తెలుసుకొన్నానంటుంది.

# టైమ్‌పాస్ తడాఖా!



✍ అల్లూరు రహీం

తమిళంలో విజయవంతమైన 'వెట్టై' చిత్రానికి తెలుగు రీమేక్‌నే తడాఖా. మల్టీ డైమక్షన్స్ పతాకంపై బెల్లంకొండ సురేష్ నిర్మాతగా వ్యవహరించి నాగచైతన్య, సునీల్ వంటి మల్టీస్టార్లతో రూపొందించిన చిత్రమిది. నాగచైతన్య, సునీల్‌ల మధ్య నీవెక్కువ... నేను తక్కువన్న 'ఇగో' సమస్యలు లేకపోవడం వల్ల ఈ చిత్రాన్ని దర్శకుడు కిషోర్ పార్థాసాని ఇబ్బందిపడకుండా తీసేశాడు. ఈ చిత్రాన్ని తమిళ వాసనలు కనపడకుండా తీసినందుకు దర్శకుడిని అభినందించాల్సిందే. ఏ భాషలోనైనా అన్నదమ్ముల అనుబంధాల మీద చిత్రాన్ని కాస్త బాగా తీస్తే చూడను ప్రేక్షకులు ఎగబడతారు. తడాఖా కూడా అదే ఫార్ములాతో నడిచింది. సునీల్ కామెడీతో కూడిన అన్న పాత్ర పోషిస్తుంటే మాస్ పాత్రలో నాగచైతన్య ఫైట్లు, ఫీట్లు, తమన్నాతో ఆటపాటలు, ముద్దులంటూ రెచ్చిపోతాడు. కామెడీ కోసం బ్రహ్మానందం, రమాప్రభ, వెన్నెల కిషోర్‌లతో సృష్టించిన పాత్రలు బాగున్నాయి. తడాఖాలో ఆరు పాటలున్నాయి. మూడు పాటలు తమన్నా, నాగచైతన్యల కాంబినేషన్‌లో సాగుతాయి. ఈ పాటల్లో తమన్నా రెచ్చిపోయి అందాల ప్రదర్శన చేసింది. అయినా ప్రేక్షకులను అంతగా ఆకట్టుకోలేదు. దీనికి కారణం థమన్ సంగీతమనక తప్పదు. ఆయన చేతి నిండా చిత్రాలుండడంతో దేడ్‌మార్ సంగీతం అందించాడు. ఆయన వాయిద్య పరికరాల నడుమ గాయనీ గాయకుల గొంతులు నలిగిపోయాయి. సాహిత్యం అర్థమై చావలేదు. తడాఖాలో నువ్వు–నేను, వియ్యాలవారు, సుభానల్లా, సాగని పథం, బొట్టూ–కాటుక చరణాలతో సాగే పాటలు గందరగోళంగా ముగిసిపోతాయి. ఈ చిత్రానికి స్క్రీన్‌ప్లే, మాటలు చాలామంది కలసి వ్రాశారు. అయినా మనిషి ధైర్యం కోల్పోయినప్పుడు చనిపోతాడు అనే డైలాగ్ మినహా మరో మంచి డైలాగ్ ఎందువల్లో పడలేదు. కెమెరామెన్ ఆర్థర్ ఎ.విల్సన్ చిత్రంలోని పాటలతోపాటు హీరోయిన్లు అందంగా కనపడేట్లు చేయడంలో తన ప్రతిభను ప్రదర్శించాడు.

చిత్రకథ లోనికి వెళ్తే ఇన్స్‌పెక్టర్ వెంకట్రావు(నాగబాబు) పిల్లలు శివ(సునీల్), కార్తీక్(నాగచైతన్య). చిన్నప్పటి నుంచి శివది రాముడు మంచి బాలుడు లాంటి వ్యక్తిత్వం. కార్తీక్ అల్లరి కృష్ణుడు తరహా. డ్యూటీలో వెంకట్రావు చనిపోవడంతో ఆ ఉద్యోగం శివకు వస్తుంది. శివ పేరుకు పోలీసు కానీ... మనసు మాత్రం చాలా సున్నితం. నేరస్తుల్ని చూస్తే చాలు భయపడిపోతుంటాడు. విశాఖపట్నంలో ఎస్‌ఐ పోస్టులో చేరే శివకు అక్కడి పోర్టు పరిధిలో స్మగ్లింగ్ చేసే బగ్గా(అశుతోష్ రాణా)తో వైరమేర్పడుతుంది. కార్తీక్‌కు ఒంటిపై ఖాకీ దుస్తులు లేకపోయినా పోలీసులాగే నడుచుకొంటుంటాడు. అన్నని ఎదిరించే నేరస్తులను తాను పట్టుకొని శిక్షిస్తుంటాడు. ఈ క్రమంలో శివకు సిఐగా ప్రమోషన్ కూడా వస్తుంది.




ఈ అన్నదమ్ములను నందు(ఆండ్రియా), పల్లవి(తమన్నా)లు ప్రేమిస్తారు. వీళ్ల బామ్మ(రమాప్రభ). వీళ్లింటి ప్రక్కన రాజారావు(బ్రహ్మానందం) వుంటాడు. నందును శివ పెళ్లి చేసుకొంటాడు. కార్తీక్‌ను పల్లవి ఇష్టపడగా అతను బలాదూర్‌గా తిరుగుతున్నాడని వారి పెళ్లికి నందు అడ్డుపడుతుంది. బగ్గాకు తనను అణగదొక్కేది శివ కాదు కార్తీక్ అని తెలిసిపోతుంది. దీంతో అతను మైండ్ గేమ్ ఆడి శివను తీవ్రంగా గాయపర్చి హాస్పిటల్ పాలయ్యేలా చేస్తాడు. కార్తీక్ తన అన్నకు అన్నివిధాల అండగా నిలబడి ఆరోగ్యం కుదుటబడేలా చేయడంతోపాటు అన్నదమ్ములిద్దరూ కలసి బగ్గాను భూస్థాపితమయ్యేలా చేస్తారు. వాస్తవం తెలుసుకొన్న నందు తన చెల్లి పల్లవిని కార్తీక్‌కు ఇచ్చి పెళ్లి చేయడంతో సినిమా ముగుస్తుంది.

చిత్రంలో సునీల్, నాగచైతన్యలతో తమన్నా, ఆండ్రియా, బ్రహ్మానందం, రమాప్రభలు తమ పాత్రలు బాగా పోషించారు. ఇంకా సిక్స్ ప్యాక్ బాడీ వుంచేసుకోవడం వల్ల సునీల్ ముఖాన కళాకాంతి కనపడదు. నాగచైతన్యకు తడాఖా మంచి లిఫ్ట్ ఇచ్చే చిత్రమే. టైమ్‌పాస్‌కు తడాఖాకు వెళ్లొచ్చు.

# ప్రేక్షకుడ్ని దగా చేస్తున్న సినిమా హాళ్ల యాజమాన్యాలు!

అధికారులు ఒకవైపు హెచ్చరికలు చేస్తుంటే మరోవైపు సినిమా హాళ్ల యాజమాన్యాలు నిర్లక్ష్యాన్ని ప్రదర్శిస్తూనే వున్నారు. సగటు ప్రేక్షకులకు కనీస సౌకర్యాలు కల్పించాలని, త్రాగునీటిని అందు బాటులో వుంచాలని, ఎసి సినిమా హాళ్లలో ప్రదర్శన మధ్యలో నిలిపివేయరాదని అధికారులు హెచ్చరిస్తుంటే అవేమీ పట్టనట్లు హాళ్ల యజమానులు వ్యవహరిస్తుం

## ఎసి వేయరు - మంచినీళ్లుండవు!

దంతో వీరి నడుమ సినిమాకు వచ్చే ప్రేక్షకుడు బలై పోతున్నాడు. వివిధ హాళ్లలో టిక్కెట్ ధరలు పెరిగాయి. దీనితోపాటు ప్రేక్షకులకు అన్నిరకాల కనీస సౌకర్యాలు కల్పించాల్సిన యాజమాన్యాలు ఆ విషయంలో నిర్ల క్ష్యంగా వ్యవహరిస్తున్నాయి. మరుగుదొడ్లు అపరిశు భ్రంగా వుంటున్నాయి. దాహం వేస్తే దప్పిక తీర్చుకొ నేందుకు మంచినీళ్లు అందుబాటులో వుండవు. నీటిని కొని తాగాల్సిందే. ఇక హాళ్లలో వుండే క్యాంటీన్లలో అన్ని వస్తువుల ధరలు ప్రేక్షకులకు చుక్కలు చూపి స్తున్నాయి. ఎమ్మార్పీ ధరకంటే అధికంగా విక్రయిస్తు న్నారు. ఏసి హాళ్లకు వెళ్లే ప్రేక్షకులు మరింతగా దగా పడుతున్నారు. సినిమా ప్రారంభంలో ఎసి వేసే యాజ మాన్యాలు ప్రేక్షకులు సినిమాలో లీనమైపోగానే ఎసిని ఆపేస్తూ ప్రేక్షకులను మోసం చేస్తున్నాయి. ఎవరైనా ప్రశ్నిస్తే రిపేరని తాపీగా సమాధానం చెప్తారు. ఇం తగా ప్రేక్షకుల హక్కులను కాలరాస్తున్న సినిమా హాళ్ల యాజమాన్యాలపై సంబంధిత అధికారులు చర్యలు తీసుకోరు. మొక్కుబడిగా సమావేశం నిర్వహించి సర్వ సాధారణంగా చేసే హెచ్చరికలు చేసి తాట తీస్తాం అంటూ హూంకరించి మిన్నకుండి పోతుండడంతో అధికారులు సమావేశాలకు వెళ్లినపుడల్లా తలవూపి తమ పని తమదే అన్నట్లు వ్యవహరిస్తున్నారు సినిమా హాళ్ల యాజమాన్యాలు. ఇటీవల జాయింట్ కలెక్టర్ లక్ష్మీ కాంతం ఆధ్వర్యంలో సినిమా హాళ్ల యాజమాన్యాలతో సమావేశం నిర్వహించి ఎప్పుడూ చేసినట్లే హెచ్చరి కలు చేశారు. కానీ పరిస్థితిలో మార్పు రాలేదు.

# ఆనం బ్రదర్స్‌పై ధ్వజం!

## ప్రజాదీవెనలో మున్ముందుకు అనిల్

ప్రజాదీవెన యాత్రలో భాగంగా నగరంలో విస్తృతంగా పర్యటిస్తున్న వైఎస్ఆర్ కాంగ్రెస్ పార్టీ నెల్లూరు నగర సమన్వయకర్త డాక్టర్ పోలుబోయిన అనిల్‌కుమార్ యాదవ్ ఆనం సోదరులపై తీవ్రస్థా యిలో విమర్శలు చేశారు. ఆర్థిక మంత్రి ఆనం రామనారాయణరెడ్డి, రూరల్ ఎమ్మెల్యే ఆనం వివేకా నందరెడ్డి వైఎస్ జగన్‌ను, ఆయన కుటుంబాన్ని విమ ర్శించడాన్ని తీవ్రంగా ఖండించారు. వైఎస్ రాజశేఖర్ రెడ్డి దయవల్ల ఆర్థికంగా, రాజకీయంగా ఎదిగిన ఆనం వివేకానందరెడ్డి, ఆయన సోదరుడు రామనా రాయణరెడ్డి నీచ రాజకీయాలకు పాల్పడుతూ వైఎస్ కుటుంబంపై బురద జల్లుతున్నారని విమర్శించారు. ఎవరు అధికారంలో వుంటే వారి పంచన చేరి పబ్బంగడుపుకోవడంలో ఆనం సోదరులది అందెవే సిన చేయన్నారు. గతంలో వైఎస్ రాజశేఖర్‌రెడ్డి ముఖ్యమంత్రిగా వున్నప్పుడు ఆయన దేవుడని, గొప్ప నాయకుడని కీర్తించిన ఆనం సోదరులు వైఎస్ మర


ప్రజాదీవెనలో అనిల్‌కుమార్.

ణానంతరం జగన్‌ను ముఖ్యమంత్రి చేయకపోతే రాష్ట్రం అగ్ని గుండం అవుతుందని హెచ్చరించి నేడు కిరణ్‌కుమార్‌రెడ్డి అధికారంలో వుండడంతో ఆయన భజన చేస్తున్నారని దుయ్యబట్టారు. పచ్చి అవకాశవా దులైన వివేకా, రామనారాయణరెడ్డిలకు జగన్‌ను, వైఎస్ కుటుంబాన్ని, వైఎస్ఆర్ కాంగ్రెస్ పార్టీ కార్య కర్తలను విమర్శించే అర్హత లేదన్నారు. ఇప్పటికైనా ఆనం సోదరులు నోరు అదుపులో పెట్టుకొని మాట్లా డాలని లేదంటే ప్రజలు జిల్లా నుంచి వారిని వెలి వేసేందుకు సిద్ధంగా వున్నారని హెచ్చరించారు.

# బిజెపి రాష్ట్ర కమిటీలో నెల్లూరీయులు!


సురేష్‌రెడ్డి అభినందన సభలో మురళీమనోహర్ జోషి.

## ● పలువురికి చోటిచ్చిన కిషన్‌రెడ్డి

బిజెపి రాష్ట్ర కమిటీలో ఈ దఫా జిల్లా నేత లకు ప్రాధాన్యం దక్కింది. ఇటీవల జరిగిన జిల్లా కార్యవర్గంలో పలు పదవులు ఆశించి భంగపడి అసంతృప్తులు, అలకలు వహించి వున్న నేతలను బుజ్జ గించేందుకు బిజెపి రాష్ట్ర అధ్యక్షుడు కిషన్‌రెడ్డి రాష్ట్ర కమిటీలో పలువురికి అవకాశం కల్పించాడు. రాష్ట్ర ప్రధాన కార్యదర్శిగా గతంలో జిల్లా అధ్యక్షుడిగా పని చేసిన సన్నపరెడ్డి సురేష్‌రెడ్డిని, రాష్ట్ర అధికార ప్రతిని ధిగా కర్నాటి ఆంజనేయరెడ్డిని నియమించారు. రాష్ట్ర కార్యదర్శులుగా కె.కోటేశ్వరరావు, కాకు విజయలక్ష్మి లను ఎంపిక చేశారు. బిజెపి జిల్లా అధ్యక్ష పదవికి పోటీపడి రెండు పర్యాయాలు భంగపడ్డ మిడతల రమే ష్‌ను, సీనియర్ నేత గడ్డం లక్ష్మీనారాయణ, వెంపు లూరి భాస్కర్‌గౌడ్, రంగినేని కృష్ణయ్యలకు రాష్ట్ర కార్య వర్గసభ్యులుగా అవకాశం కల్పించారు. ఈ ఎంపికల్లో బిసిలకు ప్రాధాన్యమిచ్చేందుకు కసరత్తు చేసింది రాష్ట్ర కమిటీ. మొత్తంమీద జిల్లాస్థాయిలో వివిధ పదవులు ఆశించి అవి దక్కకపోవడంతో పార్టీ కార్యక్రమాల్లో అంటీ ముట్టనట్లుగా వ్యవహరిస్తున్న వారిని బుజ్జగించి చురుకుగా పార్టీ కార్యక్రమాల్లో పాలు పంచుకొనేలా చేసేందుకే రాష్ట్ర పదవులు పందారం జరిగిందన్న వ్యాఖ్యలు వినవస్తున్నాయి.

# బదలీలతో అధికారులు బిజీ!

## ప్రజల సమస్యలు వినేవారెవ్వరు?

రాష్ట్ర ప్రభుత్వం బదలీలకు గ్రీన్‌సిగ్నల్ ఇవ్వ దంతో అన్ని శాఖల్లో అధికారులు బిజీగా వున్నారు. మిగిలిన అన్ని పనులు ప్రక్కనపెట్టి సిబ్బంది బద లీల్లో తలమునకలై పోయారు. ఈ నెలాఖరు నాటికి బదలీల ప్రక్రియ పూర్తి చేయాలని ప్రభుత్వం ఆదే శించడంతో అధికార యంత్రాంగం కౌన్సిలింగ్ నిర్వ హిస్తుంది. ప్రభుత్వ శాఖలన్నింటికీ ఒకేసారి బదలీ లకు సంబంధించి ఉత్తర్వులు వెలువడడంతో ప్రజల సమస్యలు పట్టించుకునే సమయం లేకుండా పోయింది. అనుకూలంగా వుండి, అన్ని సౌకర్యాలు కలిగిన ప్రాంతాలకు బదలీ చేయించుకునేందుకు ఉద్యోగులు రాజకీయ ప్రయత్నాలు చేసుకున్నారు. ఎమ్మెల్యేలు, జిల్లా మంత్రి నుంచి ఉన్నతాధికారులకు ముందుగానే సిఫార్సు చేయిస్తున్నారు. త్వరలో స్థానిక సంస్థల ఎన్నికలను దృష్టిలో వుంచుకుని తమకు సహకరించే అధికారులను వారి నియోజక వర్గాల పరిధిలో నియమించుకోవాలన్న ఆలోచనలో ఎమ్మెల్యేలు వున్నారు. ప్రధానంగా రెవిన్యూ శాఖలో తహశీల్దార్లు, ఎమ్పీడిఓలు గ్రామ పంచాయితీ ఎన్ని


కౌన్సిలింగ్ సందర్భంగా రోడ్డుపై ఉపాధ్యాయులు.

కల నిర్వహణలో కీలక పాత్ర పోషిస్తున్నారు. కౌన్సి లింగ్ ద్వారా బదలీల కార్యక్రమం జరుగుతున్నా సిఫార్సు కలిగిన వారికే తొలుత ప్రాధాన్యతనిస్తున్నా రన్న విమర్శలు వినిపిస్తున్నాయి. మండల స్థాయిలో కీలక శాఖలైన పంచాయితీరాజ్, ట్రాన్స్‌కో, వ్యవ సాయ శాఖలతోపాటు ఇతర శాఖలకు సంబంధిం చిన అధికారులను నియమించుకునేందుకు నేతలు పావులు కదిపారు. ఏది ఏమైనా ఈ సంవత్సరం జరుగుతున్న బదలీల ప్రక్రియలో ఎన్నడూలేని విధంగా రాజకీయ జోక్యం ఏర్పడడం విశేషం.

# కలెక్టర్‌ను కలిసిన యాష్‌పాండ్ బాధితులు!

జిల్లాలోని ముత్తుకూరు మండలంలో ఎపి జెన్‌కో నిర్మించనున్న బూడిద ప్లాంట్ నిర్మా ణంపై సమీప గ్రామాల ప్రజలు జిల్లా కలెక్టర్ శ్రీధ ర్‌ను కలిసి మొరపెట్టుకున్నారు. విద్యుత్ పరిశ్రమ ఏర్పాటుచేసే ముందు బూడిదను నిల్వ చేసేందుకు గ్రామాలకు దూరంగా వున్న భూముల్లో నిర్మాణాలు చేపట్టాలని అధికారులు ప్రతిపాదించారు. ఈ ప్రతి పాదనలు చేసి దాదాపు ఐదు సంవత్సరాలైంది. ఐదు సంవత్సరాల క్రితం చేసిన ప్రతిపాదనలను ఇప్పుడు ఎందుకు పాటించాలని జెన్‌కో అధికారులు భావిం చారో ఏమో తెలియదు కానీ మొత్తంమీద బూడిద ప్లాంట్ ఏర్పాటుచేసే ప్రదేశాన్ని మార్పు చేయడం జరి గింది. అధికారుల నిర్ణయాన్ని వ్యతిరేకిస్తూ సమీప గ్రామాల ప్రజలు ఆందోళన బాటపట్టారు. ధర్నాలు నిర్వహించి అధికారులకు వ్యతిరేకంగా నినాదాలు

## హామీ ఇవ్వని ఉన్నతాధికారి

చేశారు. ప్రజల ఆందోళనకు భయపడిన జెన్‌కో ప్రతి నిధులు పోలీసుల పహారాతో విధులు నిర్వహించా ల్సిన పరిస్థితి ఏర్పడింది. అంతే కాకుండా ఈ పరిశ్రమ సమీపంలో 144 సెక్షన్ కూడా విధించడం జరిగింది. దాదాపు 20 రోజుల నుంచి పోలీసుల సహకారంతో పనులు చేస్తున్నారు. ఇటీవల బూడిద ప్లాంటు వల్ల ఇబ్బందులు ఎదుర్కొనే ఆరు గ్రామాల ప్రజలు జిల్లా కేంద్రానికి తరలి వెళ్లి జిల్లా కలెక్టర్‌తో భవిష్యత్‌లో తాము ఎదుర్కోబోయే ఇబ్బందుల గురించి విన్నవించు కున్నారు. ప్రజల సమస్యలు సానుకూలంగా విన్న కలె క్టర్ ఎటువంటి హామీ ఇవ్వలేక పోయారు. ప్రజల అభి ప్రాయానికి వ్యతిరేకంగా బూడిద ప్లాంట్‌ను నిర్మిస్తే వారి ఆగ్రహాన్ని చవిచూడాల్సి వస్తుందంటున్నారు.

# సుందరయ్యకు భారతరత్న ఇవ్వాలి!


వేదికపై వరదా శ్రీనివాసులు, కేతా సుబ్బారావు తదితరులు.

నెల్లూరీయుడు, సిపిఎం పార్టీ జాతీయ కార్యదర్శిగా పని చేసిన ప్రజానాయకుడు దివంగత పుచ్చలపల్లి సుందరయ్యకు భారతరత్న అవార్డు ఇవ్వాలని నెల్లూరు సుబేదారుపేటలోని కేతా అంకులు మెమోరియల్ ట్రస్ట్ డిమాండ్ చేసింది. ఈ విషయమై ఈ ట్రస్ట్ ఒక సమావేశాన్ని నిర్వహించింది. దీనిలో అక్షరకవి వరదా శ్రీనివాసులు మాట్లాడుతూ సుందరయ్య అలగానిపాడు లోని సంపన్న రైతు కుటుంబంలో పుట్టినా పేదల పక్షపాతిగా కడదాకా నిలిచారు. ఆదర్శప్రాయుడైన ఎమ్మెల్యే, ఎమ్పీగా రాణిం చారు. పార్లమెంటుకు సైకిల్‌పై వెళ్లిన సభ్యుడు సుందరయ్య ఒక్కరే. స్వార్థం ఎక్కడ ప్రవేశిస్తుందోనని పిల్లలు పుట్టకుండా చూసుకొన్న సుందరయ్య లాంటి అరుదైన రాజకీయవేత్త ఎవ్వరూ దేశంలో కనపడరన్నారు. నిజమైన కమ్యూనిస్ట్ ఎవరంటే సుందరయ్య అని గర్వంగా చెప్పుకోగల్గిన ఆయనకు భారతరత్న అవార్డును కేంద్ర ప్రభుత్వం బేషరతుగా ఇవ్వాలన్నారు. ఈ సమావేశం కేతా సుబ్బారావు నేతృత్వంలో నడిచింది.

## పచ్చజెండా

మొదటి పేజీ కొరవ

న్నాయి. అయితే త్వరలోనే అక్కడ మూడవ లాంచ్ ప్యాడ్ నిర్మించబోతున్నారు. మానవ సహిత రాకెట్ల ప్రయోగం కోసం ఉద్దేశించినది అది. అన్నిరకాల వాతావరణ పరిస్థితులలో అత్యంత చవకగా రాకెట్లు ప్రయోగించే వీలు వుండడం వల్ల ప్రపంచంలో చాలా దేశాలు తమ ఉపగ్రహాలను ఇక్కడ నుంచి ప్రయోగించడానికి ఆసక్తి చూపుతున్నాయి. ఆ ఆసక్తి ఆచరణకు వస్తే మాత్రం దుగరాజపట్నం ఓడరేవుకు కొంత సమస్య తప్పదు. వాటి కోసం ఏటా 50 లేదా 60 రోజులపాటు ఓడరేవును మూత వేయవలసి వస్తుంది.

అయితే ఈ ఓడరేవు వల్ల జరగబోయేది ఒక్క సరకుల రవాణా మాత్రమే కాదు. దాని ఆధారంగా ఎన్నో పరిశ్రమలు నెలకొనే అవకాశం వుంది. కేంద్ర ప్రభుత్వ నిర్వహణలోనే షిప్ యార్డ్ నిర్మాణానికి కూడా అవకాశం వుంది. ప్రస్తుతం విశాఖపట్నం, బొంబాయిలో వున్న షిప్ యార్డ్‌లు దేశ అవసరాలకు ఎంత మాత్రం సరిపోవడం లేదు. కొత్త షిప్ యార్డ్ అత్యవసరంగా నిర్మించాలని సైన్యం కోరుతున్నది. అందుకు దుగరాజపట్నం ఎంపికయ్యే అవకాశం వుంది. అదే జరిగితే ఈ ప్రాంతంలో పారిశ్రామిక ప్రగతి శరవేగాన్ని అందుకొంటుంది.

చింతా మోహన్ ఆరుసార్లు ఎమ్పీగా గెలిచాడు. 1985 నుంచి ఢిల్లీలో ఒక కీలక వ్యక్తిగా చలామణి అవుతున్నాడు. ఇప్పటి పార్లమెంట్‌లో ఇంత సుదీర్ఘ అనుభవం వున్నవారు చాలా కొద్ది మంది. ఇన్నేళ్ల రాజకీయ ప్రాభవంలో జిల్లాకు, రాష్ట్రానికి పనికి వచ్చే పని ఒక్కటీ చేయలేదన్న అసంతృప్తి ఇటు ప్రజలలో, అటు ఆయనలో కూడా ప్రబలంగా వుంది. తాను చేసే పని ఏదైనా శాశ్వతంగా నిలిచి పోయేట్లు వుండాలన్నది చింతా మోహన్ కోరిక. ఆ కోరికకు అన్నివిధాల సంతృప్తిపరచే విజయం ఇది. దీనివల్ల వాకాడు, కోట మండలాలలో భూముల ధరలు ఆకాశానికి ఎగబ్రాకడం సహజం. కృష్ణపట్నం ఓడరేవు నిర్మాణ సమయంలో జరిగింది అదే. కొన్ని వేల మంది రైతులు ఆర్థికంగా స్థితిమంతులౌతారు. మరొక ప్రక్క మద్రాసుకు చాలా దగ్గరలో వున్న ఓడరేవు కాబట్టి, రోడ్డు వసతి కల్గినది కాబట్టి, పరిశ్రమలు కూడా త్వరితంగా వచ్చే అవకాశం వుంది. చింతా మోహన్ ఆశయం – దుగరాజపట్నం ఓడ రేవు ద్వారా దాదాపు 10 లక్షల మందికి ఉద్యోగ అవకాశం కల్పించాలన్నది. అది కొంత అత్యాశే కావచ్చు. కానీ కల కనేటప్పుడు ఆ మాత్రం భారీస్థాయి వుండడంలో తప్పులేదు.

జిల్లా ప్రజలు ఎప్పటికీ గుర్తు పెట్టుకొనే ఘన కార్యం సాధించిన చింతా మోహన్‌ను మనసారా అభినందిస్తున్నాము. అట్లని ఒట్టి మంజూరు కాగితంతోనే తన బాధ్యత తీరిపోయిందని సరిపెట్టుకోకుండా ఆచరణలో ఓడ రేవు నిర్మాణం మొదలయ్యే వరకు అన్ని ప్రతిబంధకాలను ఆయనే దగ్గరుండి తప్పించగలిగితే ఈ స్వప్నం నిజమౌతుంది.

## రామనారాయణరెడ్డి

9వ పేజీ కొరవ

రెడ్డి. తాను చేసిన తప్పును తెలివిగా కప్పి పుచ్చుకొనే మాయా ప్రయత్నం ఇది. ఈ పదిహేడేళ్లలో రాని మిగులు జలాలు ఇక ముందు ఎట్లా వస్తాయి? ఎవరిస్తారు? కృష్ణకు వచ్చిన వరద నీటిని ఒక్క నిముషం ఆలస్యం లేకుండా కడప జిల్లాకు తరలించుకపోవడానికి వైఎస్ రాజశేఖర్‌రెడ్డి పోతిరెడ్డిపాడు హెడ్ రెగ్యులేటర్ సామర్థ్యాన్ని 4వేల క్యూసెక్కుల నుంచి 40వేల క్యూసెక్కులకు పెంచాడు. మహబూబ్‌నగర్ అవసరాల కోసం రెండు పక్కా భారీ సొరంగాలను త్రవ్వుతున్నారు. ఆ సొరంగాలు పోతిరెడ్డిపాడు కంటే ఎగువున వున్నాయి. ఇప్పటికే కర్ణాటక, మహారాష్ట్ర ప్రభుత్వాలు మిగులు నీరు ఆధారంగా కృష్ణ మీద లెక్కలేనన్ని ప్రాజెక్టులు కట్టారు. ఇంకా కడుతున్నారు. అంటే కృష్ణకు ఎంత పెద్ద వరద వచ్చినా పోతిరెడ్డిపాడు వరకు రావడమే కష్టం. ఒకవేళ వచ్చినా కడప జిల్లా అవసరాలు ముందు తీరుతాయి. ఆ తర్వాతే సోమశిలకు వస్తాయి. సోమశిల క్రింద వుండే సాంప్రదాయ ఆయకట్టుకుపోను మిగిలితేనే కండ్లేరుకు వస్తాయి. అంతరాష్ట్ర ఒప్పందాల ప్రకారం కండ్లేరు నీటిలో మొదటి ప్రాధాన్యత మద్రాసు. ఆ తర్వాతే మనకు. దాన్నిబట్టి అర్థమయ్యేది కండ్లేరుకు భవిష్యత్తులో మిగులు జలాలన్నది దురాశ మాత్రమే.

ఈ నిజం తెలియని అమాయకుడు కాదు ఆనం రామనారాయణరెడ్డి. నీళ్ల లెక్కలు ఆయనకు తెలిసినంతగా ఇప్పటి రాజకీయవాదులు మరెవరికీ తెలియదు. అయినా పసలేని వాదనతో తన తప్పును కప్పిపుచ్చుకోవడానికి ప్రయత్నం చేయడం జిల్లాకు చేస్తున్న నేరం. ద్రోహం. ముఖ్యమంత్రితో ఆయనకు రాజకీయ అవసరాలు వుండవచ్చు. కానీ ముఖ్యమంత్రులు వస్తున్నారు; పోతున్నారు. జిల్లా రైతాంగం మాత్రం శాశ్వతంగా వుంటుంది. ఆ తేడా గ్రహించలేక పోవడం రామనారాయణరెడ్డి చేస్తున్న తప్పు. 'జమీన్‌రైతు' పత్రికకు ఆయన మీద వ్యక్తిగత ద్వేషం ఏదీ లేదు. వున్నదల్లా జిల్లా రైతుల ప్రయోజనాలకు విఘాతం కలుగుతుంటే చూస్తూ ఊరుకోలేని నిబద్ధత. ఒక స్థానిక పత్రికగా అది మా బాధ్యత. రాజకీయవాదులు చొక్కా మార్చినంత సులభంగా విధానాలు మార్చుకొంటారు. కానీ పత్రికలు ప్రజల విషయంలో ఆ పాపం చేయలేవు.

రామనారాయణరెడ్డి ఏ ఉద్దేశంతో ఈ పథకాకి ఆమోద ముద్ర వేసినా అది పెద్ద తప్పు. ప్రాయశ్చిత్తం లేని పాపం. జిల్లా రైతాంగం గొంతు కోయడానికి తడిగుడ్డ పేనుతున్నాడాయన. ఆ దుర్మార్గాన్ని ప్రతిఘటించడం రైతు సంఘాల కర్తవ్యం. ఇప్పుడు మౌనం వహిస్తే ఆ తర్వాత అరిచి గీపెట్టినా లాభం వుండదు.

## నెల్లూరుముచ్చట్లు

3వ పేజీ కొరవ

నగరంలో వ్యాపారులు ప్రదర్శన చేశారు. ఈ కార్యక్రమానికి సంఘం కార్యదర్శి భాస్కర్ నాయకత్వం వహించారు.

### బుచ్చిలో వేద పాఠశాల

బుచ్చిరెడ్డిపాళెంలో గల శ్రీ కోదండరామ స్వామి దేవస్థానం పరిధిలో వేద పాఠశాల ఏర్పాటు కానుంది. ఇక్కడ దాతల సహకారంతో నిర్మించి వున్న భవనంలో టిటిడి ఆధ్వర్యంలో వేద పాఠశాలను ప్రారంభిస్తున్నట్లు ఆలయ వ్యవస్థాపక ధర్మకర్త దొడ్ల మురళీకృష్ణారెడ్డి తెలిపారు. ఈ పాఠశాలలో చేరబోయే విద్యార్థులకు ఉచిత భోజన వసతి, స్టైఫండ్‌తోపాటు మూడు లక్షల రూపాయలను విద్యార్థి పేరున డిపాజిట్ చేస్తారట. విద్యార్థులకు చదువు పూర్తయిన తర్వాత ఆ డిపాజిట్ మొత్తాన్ని వడ్డీతో సహా అందజేస్తామని మురళీకృష్ణారెడ్డి చెప్తున్నారు. వివరాలకు 94411 83561 నెంబర్‌లో సంప్రదించాలని కోరుతున్నారు.

## వేనాడు దర్గాకు కోటంరెడ్డి!

తన మొక్కు తీర్చుకోవడంలో భాగంగా వైకాపా నెల్లూరు రూరల్ నియోజకవర్గ సమన్వయ కర్త కోటంరెడ్డి శ్రీధర్‌రెడ్డి 11వ తేదీ వేనాడు దర్గాను సందర్శించారు. వేనాడులో కనీస సౌకర్యాల కల్పనకు తనవంతు కృషి చేస్తానన్నారు.

## రామ్‌భూపాల్‌రెడ్డికి కలక్టరేట్ యూనిట్ బాధ్యత!

ఏపి రెవిన్యూ సర్వీసెస్ అసోసియేషన్ కలక్టరేట్ యూనిట్ అధ్యక్షునిగా కె.రామ్‌భూపాల్‌రెడ్డి ఎన్నికయ్యారు. 11వ తేదీ జరిగిన ఈ ఎన్నికల్లో అసోసియేట్ అధ్యక్షునిగా పి.శ్రీనివాసులు, ఉపాధ్యక్షులుగా బి.రవికుమార్, విఠల్, నరసింహం, సులోచన, కార్యదర్శిగా ఎం.ఎం.ప్రకాశరావు, కోశాధికారిగా రమణరావులను ఎన్నుకొన్నారు. ఈ ఎన్నికను సంఘం రాష్ట్ర నాయకులు మధు సూదనరావు, షఫీ మాలిక్, రామకృష్ణ పర్యవేక్షించారు.

యూనిట్ అధ్యక్షునిగా ఎన్నికైన రామ్‌భూపాల్ రెడ్డి కలక్టరేట్‌లో బాధ్యతాయుతంగా పని చేసే కొందరు ఉద్యోగుల్లో మొదటి శ్రేణిలోని వాడనవచ్చు.

## కన్యకా పరమేశ్వరమ్మ ఆలయంలో గొడవ!

నెల్లూరు స్టోన్‌హౌస్‌పేటలోని కన్యకా పరమేశ్వరమ్మ దేవస్థానం పరిపాలనా పగ్గాల కోసం ముక్కాల ద్వారకనాథ్, మంచికంటి శ్రీనివాసులు వర్గాలు 12వ తేదీ అమ్మణ్ణి సమక్షంలో గొడవకు దిగడంతో పోలీసులు జోక్యం చేసుకోవాల్సి వచ్చింది.

## సిద్ధరామయ్య ఎంపిక పట్ల హర్షం!

కర్నాటక ముఖ్యమంత్రిగా సిద్ధరామయ్య ప్రమాణ స్వీకారం చేసిన సందర్భాన్ని పురస్కరించుకొని 13వ తేదీ నెల్లూరు ఇందిరాభవన్‌లో పిసిసి కార్యదర్శి ఉడత వెంకట్రావు ఆధ్వర్యంలో టపాసులు పేల్చి, స్వీట్లు పంచారు. ఈ సందర్భంగా వెంకట్రావు మాట్లాడుతూ సిద్ధరామయ్య 40ఏళ్ల రాజకీయ జీవితంలో ఎన్నో ఆటుపోట్లను ఎదుర్కొని, పార్టీలో ఎన్నో బాధ్యతలు నిర్వర్తించి సిఎం అయిన విషయాన్ని కార్యకర్తలు గుర్తుంచుకోవాలన్నారు. కాంగ్రెస్‌లో బడుగు బలహీనవర్గాలు వెనుకబడిన వర్గాల వారికి రాజకీయంగా ముఖ్య పదవులొస్తాయన్న దానికి సిద్ధరామయ్య ఉదాహరణని రఘురామ్ ముదిరాజ్ చెప్పారు. ఈ కార్యక్రమంలో జిల్లా మహిళా కాంగ్రెస్ నాయకురాలు పందిళ్లపల్లి అరుణమ్మ, ఎస్‌సిసెల్ అధ్యక్షుడు తలారి బాలసుధాకర్, అల్లూరు అనూరాధ, పద్మావతమ్మ, లక్ష్మమ్మ తదితరులు పాల్గొన్నారు.

## తిప్పరాజు వెంకట సుబ్బయ్య జయంతి

నెల్లూరు ట్రంకురోడ్డులో తిప్పరాజు వెంకట సుబ్బయ్య సత్రం నిర్మాత వెంకట సుబ్బయ్య జయంతి 9వ తేదీ ప్రస్తుత పాలకవర్గం ఘనంగా నిర్వహించింది. ఈ సందర్భంగా అన్న, వస్త్రదానాలు చేశారు. ఈ కార్యక్రమంలో సత్రం అధ్యక్షుడు డాక్టర్ సర్వేపల్లి అజయ్‌కుమార్, డాక్టర్ పిఎన్‌ఆర్‌కెమూర్తి తదితరులు పాల్గొన్నారు.

## ఎంసెట్ మాల్ ప్రాక్టీస్‌లో నెల్లూరీయులు!

ఎంసెట్‌లో మాల్‌ప్రాక్టీస్‌కు పాల్పడుతూ తిరుపతిలో పోలీసులకు దొరికిన ఇద్దరు వ్యక్తులు జిల్లా వాసులు కావడం కలకలం సృష్టించింది. లక్షల రూపాయలు బేరం కుదుర్చుకుని ఎంసెట్ వ్రాసే విద్యార్థులకు సమాధానాలు వ్రాస్తూ నెల్లూరుకు చెందిన రాజమోహన్‌రెడ్డి, బ్రహ్మేశ్వరనాయుడు పోలీసులకు పట్టుబడడంతో ఈ వ్యవహారం వెలుగు చూసింది. వీరిలో రాజమోహన్‌రెడ్డి నారాయణ మెడికల్ కళాశాలలో ఎంబిబిఎస్ తృతీయ సంవత్సరం చదువుతుండగా, బ్రహ్మేశ్వరనాయుడు అదే ఆస్పత్రిలో హౌస్ సర్జన్‌గా పని చేస్తున్నాడు. ఉన్నత కుటుంబ నేపథ్యం కల్గిన వీరిరువురు అడ్డదారులు తొక్కి ఎంసెట్ విద్యార్థులకు ఆశ చూపి చివరకు పోలీసులకు దొరికి పోవడం చర్చనీయాంశమయ్యింది.

## రేషన్ బియ్యం అక్రమ రవాణా

రేషన్ షాపుల్లో పేదలకు ఇవ్వాల్సిన చౌక బియ్యాన్ని బ్లాక్ మార్కెట్‌కు తరలిస్తుండగా అధికారులు పట్టుకొన్నారు. నెల్లూరు శెట్టిగుంట రోడ్డులో ఈ రేషన్ బియ్యాన్ని దొంగచాటుగా ఆటోల్లో వేసి రహస్య ప్రదేశానికి తీసుకొని పోతుండగా పౌరసరఫరాల శాఖాధికారులు సమాచారం అందుకొని దాడి చేశారు. ఆ సమయంలో ఆటోలో తరలించుకుపోతున్న 11 క్వింటాళ్ల రేషన్ బియ్యాన్ని అధికారులు స్వాధీనం చేసుకొన్నారు.

## పెంచలకోన నరసింహస్వామి బ్రహ్మోత్సవాలు!

పెంచలకోనలోని లక్ష్మీ నరసింహస్వామి బ్రహ్మోత్సవాలు 22వ తేదీ నుంచి 25వ తేదీ వరకు జరుగుతాయి. 22వ తేదీ బంగారు హనుమంత సేవ, 23వ తేదీ బంగారు గరుడసేవ, 24వ తేదీ కళ్యాణం, సాయంత్రం రథోత్సవం, 25 తేదీ తెప్పోత్సవం జరుగుతాయి. 23వ తేదీ స్వామి జయంతి సందర్భంగా వెంకటగిరి ఎమ్మెల్యే కురుగొండ్ల రామకృష్ణ పట్టు వస్త్రాలు సమర్పిస్తారు. 24వ తేదీ జరిగే స్వామి కళ్యాణం వెంకటేశ్వర భక్తి ఛానల్‌లో ప్రసారమవుతుంది. స్వామి భక్తులను ఉత్సవాలకు హాజరు కమ్మంటున్నాడు సహాయ కమిషనర్ డి.శ్రీనివాసరావు.

## జనవాణి

2వ పేజీ కొరవ

### న్యాయవాద గుమాస్తా అంటే...

న్యాయం కోసం అన్యాయంపై చేసే పోరాటంలో వాద ప్రతివాదనల్లో తమ న్యాయవాదికి సహకరిస్తూ దయగల మనసు కలిగి, గుర్తింపు కొరకుగాక తమ కక్షిదారుని మనసు తెలుసుకొని వారికి మనస్తాపం కలగనీయక ప్రవర్తించగలిగేవాడే న్యాయవాద గుమాస్తా. ఈ విషయాన్ని ప్రతిఒక్క న్యాయవాద గుమాస్తా గుర్తెరిగి వ్యవహరించమనవి.

అన్నవరం సత్యనారాయణ నెల్లూరు

## పదరంగం -67

నిర్వహణ : బాబాజీ

| | | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|
| 1 | | 2 | | | 3 | 4 | 5 | | |
| | | | | 6 | | | | | 7 |
| | | 8 | 9 | | | 10 | | | |
| | 11 | | | | | | | 12 | |
| 13 | | | | | 14 | | | | |
| 15 | | | 16 | | | | | 17 | |
| | | 18 | | | 19 | 20 | 21 | | |
| 22 | 23 | | | 24 | | 25 | | | 26 |
| 27 | | | 28 | | | | 29 | 30 | |
| | | 31 | | | | 32 | | 33 | |

**అడ్డం**

1. అనుభవంతో కలిగిన బుద్ధి (4)
3. నావను నడుపువాడు (4)
6. క్రిందికి దించడం (4)
8. నడక (3)
10. మెషిన్ (2)
11. తెలివి, చాతుర్యం (4)
12. తెలుగు గేమ్ (2)
13. తెలంగాణ పిలగాడు (3)
14. విజ్ఞప్తి పత్రం (4)
15. ముస్లిం వివాహం (2)
16. ప్రయోజనం, చెడ్డకాదు (2)
17. వాక్కు (2)
18. తెలుగు ఫెదర్ (2)
19. అమ్మకం కాదు (4)
22. విజ్ఞాపన, విన్నపము (3)
25. అటునుంచి కోల్డు (2)
27. ఖండము, చిన్నభాగం (2)
28. తేజస్సు (3)
29. అటునుంచి కపోతం (3)
31. వసంతం ఒక సినీనటి (3)
32. ఇంగ్లీషు చట్టం, నిలువు 30తో కలిస్తే 25పైసలు (1)
33. ఢిల్లీ విమానాశ్రయం పేరు (2)

**నిలువు**

1. రోజా పువ్వు (3)
2. పండితుడు (5)
3. పడవ (2)
4. వినమ్రత (3)
5. పన్నాగము (3)
6. అంతులేని (3)
7. తడబడిన తాటకి (3)
9. యంత్రము, బోల్టు (2)
11. రాట్నం (3)
12. గుర్తు (4)
13. ఇంగ్లీషు గుర్రం పిల్ల (2)
16. మేషము (2)
18. అతివృష్టి బాధ (2)
20. అల్పమైన, చిక్కు (2)
21. కన్పించునది (3)
22. సుముఖం కాదు (3)
23. జంబూకం (2)
24. క్రింద నుంచి సత్యం, అబద్ధం కాదు (3)
26. ఫురె (3)
28. తడి (2)
30. క్రింద నుంచి నాల్గవ భాగం (2)

**సమాధానాలు**

## పదరంగం -66

| | | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|
| 1నీ | రా | 2జ | నం | | 3స | | 4స్టో | పా | 5నం |
| ల | | ల | | 6న | స్య | ము | | | వ |
| 7గి | రి | జ | | | శ్యా | | 8ప్ర | 9తి | భ |
| రి | | | 10చె | ల | మ | | 11మా | రు | |
| | 12కో | నే | రు | | 13లం | 14ఖ | ణం | | 15శి |
| 16వా | లా | | 17వు | 18ఆ | | ర | | 19శ | 20రం |
| 20పు | టం | | | 21దా | పు | | 22రా | క | |
| | | 23ఉ | 24ద | యం | | 25పో | రా | టం | |
| 26స | దా | | శ | | 27లు | క | జు | | 28వే |
| రి | | 29అ | మి | త | | తం | | 30ఆ | ట |

# నిర్భయ చట్టంతో మహిళాలోకం నిర్భయంగా వుండొచ్చా?

భార్యను భర్త ఆమె అంగీకారంతో అనుభవించినా అది 'రేప్' అనగా బలాత్కార నేరమని తద్వారా జైలు శిక్ష తప్పదని మీకు తెలుసా? ఐతే రేప్ అనబడే అత్యాచారం గూర్చి చదవండి...

### పది ముఖ్యాంశాలు

1. 'రేప్' అనే పదం రేపియో అనే లాటిన్ భాష నుండి వచ్చిన పదం. ఇంగ్లీషులో 'సీజ్' అంటారు. 'సీజ్' అనగా ఆధీనంలోలేని దానిని దౌర్జన్యంగా స్వాధీనపర్చుకొనుటని అర్థం.

ఉదాహరణకి... నిద్రిస్తున్న భార్యాభర్తల్లో భర్త కేదో ఫోను ద్వారా పనిబడి బయటకెళ్లాడు. చిర కాలంగా ఆమెను అనుభవించాలని, ఆ అదును కోసం ఎదురుచూస్తూ వుండిన ఒక వ్యక్తి మెల్లగా ఆమె ప్రక్కన పడుకుని, నిద్రమత్తులో అతడు తన భర్తే అనుకుని అనుమతించినంతనే అతడామెతో కోర్కె తీర్చుకున్నాక, ఆవిడకనుమానం తోచి, అతడు తన మగడు కాదని గుర్తెరిగి, రిపోర్టిస్తే చట్టరీత్యా అది 'రేపే'.

2. వివాహితైనా, కుమారి ఐనా, ఇద్దరు ముగ్గురు కలిసి బలాత్కారంగా ఆవిడ ఆమోదం లేకుండా మోజుతీర్చుకుంటే అది 'రేపే'.
3. మారణాయుధాలతో భయపెట్టి, ఒంటరిగానున్న సమయాన సంభోగిస్తే అది 'రేపే'.
4. మాదకద్రవ్యాలనో, మత్తుమందిచ్చిగానీ, బలవంతంగా మద్యం తాగించి, ఆవిడ మైకంలో ఉండగా మానాన్ని మైలపరిస్తే అది 'రేపే'.
5. వెర్రిదైన ఉన్మదితను, అట్టి ముదిత అంగీకరించినా, రతికి ఉపక్రమించినా అది 'రేపే'.
6. రంకుటాలుగా ముద్రపడిన తొత్తునైనా అంగీకారం లేకుండా పొత్తు పెట్టుకుని పొందుకు సమాయత్తుడై, సంభోగించినా అది 'రేపే'.
7. ప్రయివేటు రంగాల్లోని, లేదా ప్రభుత్వ వ్యవస్థల్లోని ఏ అధికారిగానీ, తన క్రిందిస్థాయి ఉద్యోగినిని అతడి అధికార దర్పంతో ఆవిడ అడ్డగించినా, అత్యాచారానికి పాల్పడి ఆనందమొందినా అది 'రేపే'.
8. ఒక మేజరైన స్త్రీని ఆవిడ అనుమతి లేకుండా విషయవాంఛితుడై రతికి ఉపక్రమించడంలో ఆమె పెనుగులాటతో, మోజు తీర్చు కోలేకపోయినా, కేవలం అతడి అంగం, యోని పెదాలకుగానీ, ఆవిడ మర్మాంగ శీర్షానికి తగిలినట్లు తేలినా అది 'రేపే'.
9. స్వంత సతినైనా ఆమె వయసు 16లోపు వుంటే ఆవిడ భర్తకు పూర్తి సహకారం అందించినా, అట్టి సతితో చేసే రతి కూడా 'రేపే'.(Sec 375 IPC)
10. 16 సంవత్సరాలు నిండిన భార్య అనుమతించని పక్షాన భర్త బలవంతంగా బలాత్కరించి సంపర్కిస్తే అది మాత్రం 'రేప్' కాదు. దానికి కారణం... వివాహ సమయాన అగ్ని సాక్షిగా తన భర్తకు జీవితాంతం తన అంగీకారాన్నిచ్చినట్లు మన హైందవ శాస్త్రం నిర్దేశించి ఉన్నది. కనుక మాటిమాటికీ మొగుడు పెళ్లాం నుండి అనుమతి కోరి దేబిరించనక్కర్లేదు.

### నిర్భయ చట్టం

ఓ నెల క్రితం నుండి 'నిర్భయ' అనే మహిళపై సామూహిక అత్యాచారం జరగడం, పిదప ఆ పైశాచిక పరమ పాతక చిత్తుల చిత్రహింస వలన చితిగామారిన ఆ కర్కోటక ఉదంతాన్ని పురస్కరించుకొని పార్లమెంటులో మునుపటి ఐపిసి 376 A.B.C.D.E సెక్షన్లతో కూడిన పైన చెప్పిన 10 క్రిమినల్ నేరాలకు తోడు ఐపిసి సెక్షన్ 53 క్రింద స్త్రీ వయస్సును మేజర్‌గా ఉండిన 16 నుండి 18 సంవత్సరాలుగా మార్చారు.

మిగతా సవరణలు కూడా 'రేప్' అనే నిర్వచనం క్రిందికే తీసుకు రావడమేగాక క్రితం కన్నా కఠిన శిక్షాస్మృతుల బిల్లును పార్లమెంటులో పెట్టగా ఆమోదింపబడింది... అవి –

1. మహిళల్ని హేళనగా కోతి చేష్టలు చేస్తూ వెంటబడి కంటతడి పెట్టించి మానసిక చింతనకు గురి చేయడం.
2. స్నానం చేసేప్పుడు తొంగి చూడ్డం, ఫోటోలు తీయడం, వస్త్రాలు మార్చుకునేప్పుడు నక్కి చూడడం.
3. సామూహిక అత్యాచారానికి పాల్పడితే 20 నుండి జీవితాంతం జైలు జీవితం.
4. స్త్రీలు అంగీకార(అనుమతిచ్చే వయసు) ప్రాయాన్ని 16 నుండి 18కి పెంపు. కనుక 18లోపు వయస్సు వున్న స్త్రీ అనుమతించినా ఆ పరపరాగం 'రేపే'.
5. యాసిడ్ దాడుల్లాంటి ప్రేతాత్మ పనులకు పాల్పడేవారికి పదేళ్ల కఠిన కారాగారం. పోతే బలాత్కార బాధితులకు పోలీస్ పర్మిషన్ లేదా ప్రభుత్వాసుపత్రుల్లో వైద్యం తప్ప నిసరిగా వుండిన షరతుకు బదులు, సంబంధిత డాక్టర్లు ఎవరి చేతనైనా ఏ నియమ నిబంధనలు లేకుండా వెంటనే వైద్యం చేయించుకునేందుకు సుముఖత. కార్పొరేట్ ఆసుపత్రులైనా కూడా. ఐతే తదుపరి కోర్టులు చుట్టూ ఎవళ్లు తిరుగుతారనే భావనతో పాలీ క్లినిక్స్, నర్సింగ్‌హోమ్‌లలో వసతులుండీ వైద్యం చేయడానికి అభ్యంతరం పెడితే ఆ డాక్టర్లకు ఏడాదిపాటు చెర.

### తప్పుడు ఫిర్యాదు చేస్తే శిక్ష!

ఒక మహిళ, కసితోటిగానీ, రాజకీయ నేతలకు గిట్టని వారిని ఇబ్బందికి గురి చేసే నెపంతో ఆవిడకు డబ్బు ఆశ చూపి నిరపరాధిపై అపరాధి ముద్ర వేసేందుకు అంగీకరింపజేస్తే, ఆవిడ రుజువుల కోసం వలువలు చింపుకుని, గోళ్లతో శరీరాన్ని రక్కుకొని, అర నిమిషం మిరపకాయ మంట భరించి, తన మర్మాంగంలో వుంచుకొని పచ్చి కోడిగుడ్డు తెల్ల సొనను యోనిలోనూ Pubic Hairపైన, మర్మాంగ ముఖ ద్వారమందలి పెదాలపైన శీర్షమీద పూసుకొని(ఇంద్రియం అని నమ్మబలికేందుకు) రిపోర్టిస్తే, అట్టి దానిని 'సూడో' రేప్ అంటారు. అంటే డూప్లికేటు, నకిలీ నిందారోపణనన్న మాట. ఇట్టి సూడో 'రేపు' డాక్టర్లను వృధాగా పరీక్షిస్తాయి. అబద్ధపు ఆరోపణగా తేలితే న్యాయస్థానాలు అట్టి మహిళలను గట్టిగా శిక్షిస్తాయి(రుజువుల ఐపిసి 90 సెక్షన్‌ను బట్టి).

### ఆడ పిల్లలకు ఓ సలహా!

నా స్పెషాలిటీకి సంబంధించి ఇంత మాత్రం సమాచారం ఇవ్వడం ('రేప్' గూర్చి) సముచితం. లోతుగా చెప్పాల్సి వస్తే అది న్యాయవాదులు, న్యాయాధిపతుల పరిధిని చిన్నబుచ్చినట్లవుతుంది.



డాక్టర్ పెల్లకూరు జెపి.రెడ్డి
చర్మ మరియు సెక్సాలజిస్ట్
నెల్లూరు.

నా స్వభిప్రాయం... మహిళలకింత రక్షణగా ఎలాంటి కీడు జరుగని విధంగా మరి కొన్ని సవరణలతో సరికొత్త కఠిన చర్యలను అమలు పర్చదలచిన కేంద్రం యొక్క ఉద్దేశం మంచిదే. మరి ఈ తరం ఆడపిల్లల్లో 15 శాతం మంది వీటి మూలాన అహంకారంతో, చదువుతోపాటు సంస్కారం పెంచుకోకుండా నేను ఎలాగైనా బ్రతుగ్గలనే ధీమాతో, భర్తల దిమాక్ కరాబ్ చేస్తున్నారు. ఊహా లోకాల్లో, ఈ సినిమాలు, సీరియళ్లు చూచి పోల్చుకుని, సహజత్వానికి విరుద్ధంగా ఆలోచిస్తూ, నసపెట్టి, పేరు పెట్టిపిలుస్తూ పెద్దరికాన్ని క్కూడా విలువివ్వకుండా, మానసికంగా హింసిస్తున్న ఉదంతాలతో, విసిగి పోతున్న వారి మాటేమిటి. కనీసం విడాకులు మంజూరు చేయడంలోనైనా వారికి సమంగా సహకరించాలి. మగవాళ్లు ఇంటి విషయాలు మిత్రులతో కూడా చెప్పుకోలేరు. తల్లితండ్రులు బ్రతికుంటే వారికి తప్ప. అలాంటి శాడిస్టు భార్యలు అంగీకరించకుండా వాళ్లతత్వం మార్చుకోకుండా, బిడ్డ పడే అవస్థలకు వృద్ధులైన తల్లితండ్రుల కొరకైనా సామరస్యంగా విడిపోయే ఏర్పాటు చేయడం వంటిదైనా చట్టబద్ధం చేయడం, ఆ నసలనే నలతల నుండి మగాడికి విముక్తి ప్రసాదించడం ప్రభుత్వ కర్తవ్యం. ఒకవైపు మన సంస్కృతి చెడుతుందని అంటూనే జీన్స్ ఫ్యాంట్లు వేసుకునే ఇప్పటి అమ్మాయిలు వారికి అనుపించడం లేదా? మగాళ్లు గౌనుగానీ, చీరగానీ కట్టుకుంటున్నారా?

### మీడియా పాత్ర ముఖ్యం

పోతే ఈ బలాత్కారాలు మనకు తెలిసేది తెలిపేది మీడియా. గణాంకాల బట్టి మహానగరాలు నగరాల్లో కంటే పల్లెలు, కుగ్రామాల్లోనే ఇవి ఎక్కువ. అవి బయటకు పొక్కకపోవడానికి రెండు కారణాలు. ఒకటి పరువుకెరసి కన్నవారు, రిపోర్టు ఇవ్వకపోవడం. రెండవది మీడియా ప్రతినిధులు వేనవేల పల్లెల్లో కూడా (టివి, పత్రికలు కలగలిపే మీడియా) రిపోర్టర్లను పెట్టే ఆర్థిక స్థోమత పెద్ద పెద్ద దూరదర్శన్ ఛానళ్ల వారికే లేదు. ఇక ఓ రాష్ట్రానికో, జిల్లాకో పరిమితమైన పత్రికల వాళ్లకది ఎండమావే. ఔనాకాదా? అలాంటప్పుడు మన తాహత్తు తగినంతగా(పార్టీల వారు పార్టీ ఫండ్ అనే నెపంతో వేల కోట్లు వెనకేసుకొంటున్నట్లు గాకుండా) వారు అడుగకపోయినా విస్తృత సమాచారం కొరకు మీకు నచ్చిన ఛానళ్ల వారికి మీకిష్టమైన పత్రికల వారికి, అదనపు రిపోర్టర్ల కొరకు, విరాళాలిస్తే అప్పుడన్నీ తెలుస్తాయి. అంతదాకా ఈ అత్యాచారాలు నిత్యాచారాలుగా మారి, మహమ్మారిలా విపరీతంగా వ్యాపిస్తాయి. దీన్ని కేవలం రేప్ గూర్చే కాదు. అక్రమ వక్ర వికృతముల పాలిట కుగ్రామాల్లో జరిగేవి కూడా వెలుగులోకొస్తే ఇక ఆ అకృత్యాలు తగ్గుతాయి.

Regn.No. : RN 1156 / 57 J/Nellore/008/12-14
జమీన్‌రైతు

• కర్నాటక ఎన్నికలకు

# కిరణ్ భారీ చందా!

**కర్నాటక ఎన్నికల ఫలితాలు వెలువడగానే సోనియాగాంధీ స్వయంగా కిరణ్‌కుమార్ రెడ్డికి ఫోన్ చేసి కృతజ్ఞతలు చెప్పారట. ఢిల్లీ రాజకీయాలు తెలిసిన వారికి మాత్రమే ఇది ఎంత గొప్ప విశేషమో అర్ధమౌతుంది.**



కర్నాటకలో ఇటీవల జరిగిన శాసనసభ ఎన్నికలలో కాంగ్రెస్ పార్టీ ఖర్చు మొత్తాన్ని మన ముఖ్యమంత్రి కిరణ్ కుమార్‌రెడ్డి భరించినట్లు విశ్వసనీయంగా తెలుస్తున్నది. దాదాపు వంద కోట్ల రూపాయల భారీ చందా ఆయన నుంచి పార్టీకి అందిందని చెప్తున్నారు. గతంలో వైఎస్ రాజశేఖర్‌రెడ్డి ఇటువంటి ఉపకరణాల విషయంలో అందరికంటే ముందు వుండేవాడని ప్రతీతి. బీహార్ ఎన్నికల సమయంలో తోచిన సహాయం చెయ్యమని సోనియాగాంధీ అడిగితే, ఆమె ఆశించిన దానికంటే రెండింతలు అధికంగా చందా పంపాడని గొప్పగా చెప్పేవారు. ఆ ఉదారత ఫలితమే వైఎస్ ముఖ్యమంత్రిగా వున్నన్ని రోజులూ సోనియా గాంధీ, ఇతర కాంగ్రెస్ పెద్దలు ఆయన్ను అతి ముఖ్యవ్యక్తిగా పరిగణించేవారు. ఆయన మీద ఎవరు పితూరీలు చెప్పబోయినా విన్పించుకొనే వారు కాదు. వైఎస్ పని తీరును దగ్గరగా చూసిన కిరణ్‌కుమార్ రెడ్డి, ఢిల్లీ పెద్దల మనసు గెల్చుకోవడంలో వైఎస్ కంటే ఆరాకులు ఎక్కువ చదువుతున్నట్లు కన్పిస్తున్నది. ఎన్నికల ఫలితాలు వెలువడగానే సోనియా గాంధీ స్వయంగా కిరణ్ కుమార్‌రెడ్డికి ఫోన్ చేసి, కృతజ్ఞతలు చెప్పారట. ఢిల్లీ రాజకీయాలు తెలిసిన వారికి మాత్రమే ఇది ఎంత గొప్ప విశేషమో అర్ధమౌతుంది. ఈ రోజు మూటల కొద్దీ డబ్బు ఇచ్చినా రేపు పొద్దున వెళ్తే నువ్వెవరనే ధోరణిలో చూడడం ఢిల్లీ కాంగ్రెస్ నేతల తత్వం. అటువంటిది ఇచ్చిన చందాకు సోనియా గాంధీ నేరుగా కృతజ్ఞతలు చెప్పడం అంటే, ఆమె మనసును కిరణ్ ఎంతగా గెల్చుకొన్నాడో అర్ధం చేసుకోవచ్చు. ఆమె అనుగ్రహం దొరకడం అంటే, ఆయన పదవి ఫెవికాల్ కంటే గట్టిగా అతుక్కొని పోవడం అని అర్ధం. అసమ్మతి వాదులు ఎంత అరిచి గీపెట్టుకొన్నా ఇప్పట్లో ఆయన ధూపం తెంపలేరని ఖండితంగా చెప్పవచ్చు.

• గూడూరు, సూళ్లూరుపేట

# మేకపాటికి నిరాశ!

నెల్లూరు జిల్లాలోని అన్నీ నియోజకవర్గాలలో తన మాట చెల్లించుకోవాలని ఆశపడిన మేకపాటి రాజమోహన్‌రెడ్డికి తీవ్రమైన నిరాశ మిగిల్చాడు వైఎస్.జగన్. అందరికంటే ముందుగా జగన్ పక్షం చేరి, వ్యాపారాలను పణంగా పెట్టి, చివరకు ఎమ్పీ పదవి రాజీనామాకు కూడా సిద్ధపడిన మేకపాటి రాజమోహన్‌రెడ్డి జిల్లావరకైనా తన మాట చెల్లుబాటు కావాలని కోరుకోవడంలో తప్పు లేదు. ఏ రాజకీయవాది అయినా అదే కోణంలో ఆశ పడతాడు. కానీ జగన్ వైఖరి విభిన్నమైనది. తన పార్టీలో తన మాట వినేవారు వుండాలే తప్ప తాను వేరొకరి మాట వినే అవకాశం ఇవ్వకపోవడం ఆయన తత్వం. ఆలోచన తప్ప సమాలోచనే అంగీకరించడు. అయితే మేకపాటి మీద వున్న అపారమైన గౌరవంతో తతిమా వారి వలె ఖండితంగా చెప్పకుండా నచ్చ చెప్పే ధోరణిలో వ్యవహరిస్తున్నాడు. నెల్లూరు రూరల్, నెల్లూరు నగరం, వెంకటగిరి నియోజకవర్గాల విషయంలో ఆయన్ను ఒప్పించి అభ్యర్ధులను ప్రకటించారు. గూడూరు, సూళ్లూరు పేటలను పక్కన పెట్టారు. ఇప్పుడు ఆ రెండింటి విషయంలో కూడా ఒక నిర్ణయానికి వచ్చినట్లు తెలుస్తున్నది.

కొండా సురేఖ, కొణతాల రామకృష్ణ విషయంలో వైఎస్ జగన్ చాలా నిక్కచ్చిగా ప్రవర్తించారు. మేకపాటి వలెనే వారిద్దరు కూడా జగన్ కోసం సర్వం ధార పోసినవారు. ఆయన వలెనే తమ తమ జిల్లాలలో తమ మాట చెల్లుబాటు కావాలని కోరుకొన్నారు. కానీ చివరికి వచ్చేసరికి పరిస్థితి వికటించింది. ఆ రెండు జిల్లాలలో తాను తీసుకొన్న నిర్ణయాలు మార్చుకోనని, ఇష్టం లేకుంటే పార్టీ వదలి వెళ్లిపోండి అన్నంత కఠినంగా సందేశం పంపాడు జగన్. దానితో దెబ్బకు దెయ్యం దిగి వచ్చింది. ఇద్దరూ రాజీ పడిపోయారు.ఇదే అదునుగా నెల్లూరుజిల్లా విషయంలోనూ ఒక నిర్ణయానికి వచ్చినట్లు చెప్తున్నారు. గూడూరుకు చెంతాటి బాలచెన్నయ్య, సూళ్లూరుపేటకు నెలవల సుబ్రహ్మణ్యం పేర్లను జగన్ ఖరారు చేశారట. ఆ విషయం మేకపాటికి తెలియజేశారట. గూడూరు విషయంలో కోవూరు ఎమ్మెల్యే నల్లపరెడ్డి ప్రసన్న కుమార్‌రెడ్డికి కూడా కొంత ఆశ వుండింది. తాను మొదటవచ్చిన ఎమ్మెల్యే కాబట్టి, తన మాట ఎంతో కొంత చలామణి అవుతుందని భావించాడు. కొండా సురేఖకే ఆ దుర్గతి పట్టడంతో ఆయన మౌనం వహిస్తున్నాడు ఇప్పుడు. గూడూరులో పాశం సునీల్ కుమార్‌ని నిలబెట్టాలన్న కోరికను పక్కన పెట్టేశాడు.



# టిఎస్ఆర్‌కు వైఎస్ఆర్ పార్టీ గాలం!



**• విశాఖపట్నం లోక్‌సభ స్థానం విషయంలో సుబ్బరామరెడ్డి పడుతున్న ఇబ్బందిని అవకాశంగా మలచుకొనే యత్నం.**

జాతీయ స్థాయి కాంగ్రెస్ నేతగా ఎదిగిన నెల్లూరీయుడు తిక్కవరపు సుబ్బరామరెడ్డిని తమ వైపు ఆకర్షింప చేసుకోవడానికి వైఎస్ఆర్ కాంగ్రెస్ పార్టీ తీవ్రంగా ప్రయత్నిస్తున్నట్లు తెలుస్తున్నది. ఢిల్లీ రాజకీయాలు చాలా క్లిష్టమైనవి. అక్కడ పలుకుబడి, ప్రాపకం పెంచుకోవడం చాలా కష్టం. డబ్బు, పదవి వుంటే సరిపోదు. దానికి మించి, మానవ సంబంధాలు పెంచుకోగల్గిన నేర్పు కావాలి. వైఎస్ఆర్ కాంగ్రెస్‌కు ఇద్దరు ఎమ్పీలున్నారిప్పుడు. మేకపాటి రాజమోహన్‌రెడ్డి, మైసూరారెడ్డి. అయితే వారిద్దరూ చొరవగా దూసుకపోగల్గిన తత్వం కల్గిన వారు కారు. దానితో ఢిల్లీలో జగన్ పార్టీకి ఉనికి కన్పించకుండా పోతున్నది. ఆ కొరత తీర్చగల్గిన నేత కోసం జగన్ చాలాకాలం నుంచి అన్వేషిస్తున్నాడు.

సుబ్బరామరెడ్డి గారి ఢిల్లీ పరిచయాలు, పలుకుబడి మాటలలో చెప్పలేము. రాజకీయ, అధికార యంత్రాంగం, దౌత్య, పారిశ్రామిక, సినిమా, ఆధ్యాత్మిక, కళా రంగాలన్నిటిలోకి చొచ్చుక పోయాడాయన. దేశంలో పెద్ద వారని చెప్పుకోదగిన ప్రతి వ్యక్తితోనూ ఆయనకు వ్యక్తిగత పరిచయం వుంటుంది. ఆయన ఇచ్చే విందులకు హాజరయ్యే వారి ముఖాలు చూస్తే ఆశ్చర్యం కలుగుతుంది. ప్రధాన మంత్రి, ప్రతిపక్ష నేతలిద్దరినీ ఒకేసారి ఒకే విందుకోసం తన ఇంటికి పిలిపించుకోగల్గిన నేర్పరి.

అయితే విశాఖపట్నం లోక్‌సభ స్థానం విషయంలో ఆయన ఇబ్బంది పడుతున్నాడు. విశాఖ ఉక్కు కర్మాగారం నిర్మాణం మొదలైన నాటి నుంచి టిఎస్ఆర్‌కు విశాఖకు విడదీయరాని అనుబంధం ఏర్పడింది. అక్కడ ఆయన ఇల్లు కట్టుకొన్నాడు. లెక్కలేనన్ని కళా, ఆధ్యాత్మిక కార్యక్రమాలు నిర్వహించాడు. శివరాత్రి రోజు విశాఖ సముద్ర తీరంలో లక్షమంది భక్తుల చేత ఆయనే స్వయంగా రుద్రాభిషేకం జరిపిస్తాడు. గొప్ప కళా వేదిక నిర్మించాడు. 1996లోనే విశాఖ నుంచి లోక్‌సభకు ఎంపికైనాడు. ఆనాటి నుంచి నేటి వరకు ఎన్నికలలో పోటీ చేసినా చేయకపోయినా వందలాది గ్రామాలకు మంచినీరు సరఫరా చేస్తున్నాడు. వందలాది మంది విద్యార్థుల చదువుకు సహాయం చేస్తున్నాడు. పుట్టింది నెల్లూరులో అయినా విశాఖ నగరం ఆయనకు పుట్టింటితో సమానం. రాజ్యసభ సభ్యుడిగా వుండినందువల్ల 2009లో అక్కడ నుంచి పురంధేశ్వరిని పోటీకి నిలిపింది కాంగ్రెస్ అధిష్టానం. ఈసారి ఆ స్థానం తనకు కావాలన్నది ఆయన కోరిక. అయితే అందుకు ఆమె ఒప్పుకోవడం లేదు. నేను సీటు మారను అని ఖండితంగా చెప్తున్నారు. ఈ పేచీ విషయంలో కాంగ్రెస్ అధిష్టానం ఒక స్పష్టత ఇవ్వడం లేదు. అది కాంగ్రెస్ సాంప్రదాయం కూడా కాదు. ఎన్నికలను ప్రకటించి, నామినేషన్లకు చివరిరోజు అంటే తప్ప ఏస్థానంలో ఎవరు అభ్యర్ధో చెప్పరు వారు. ఎన్నికలకు ఏడాది ముందు అభ్యర్థుల విషయంలో స్పష్టత వారి నుంచి ఆశించడం అవివేకం.

ఈ పరిస్థితిని తనకు అనుకూలంగా మలచుకోవడానికి జగన్ ప్రయత్నిస్తున్నాడు. సుబ్బరామరెడ్డి తన పార్టీలోకి వస్తే విశాఖ టిక్కెట్ ఇస్తానని ఆశ చూపుతున్నాడు. జగన్ ఆంతరంగిక మిత్రుడు విజయసాయి రెడ్డి, జగన్ పిన తండ్రి వైవి సుబ్బారెడ్డి ఇప్పటికే ఒకటి రెండుసార్లు సుబ్బరామరెడ్డి ఇంటికి వెళ్లి, తమ ప్రతిపాదన చెప్పి వచ్చారట. అయితే సుబ్బరామరెడ్డి గారు ఏ స్పందనా చూపినట్లు లేదు.

సుబ్బరామరెడ్డి గారిని తమ వైపు ఆకర్షింప చేసుకోగల్గితే జగన్ పార్టీకి అది పెద్ద విజయం అవుతుంది. ఢిల్లీలో తమ పనులు చక్కబెట్టగల్గిన పెద్ద మనిషి దొరకడంతో పాటు, రాష్ట్రంలో ఒక కీలక నేతను పక్కకు తప్పించడం ద్వారా కాంగ్రెస్‌ను నైతికంగా దెబ్బ తీసే వీలు కలుగుతుంది. సుబ్బరామరెడ్డి గారు జగన్‌కు ఆ అవకాశం ఇస్తాడా, ఇరవయ్యేళ్ల కాంగ్రెస్ అనుబంధాన్ని అంత త్వరగా తెంచుకొంటాడా అన్నది వేచి చూడాలి.



Edited, Printed and Published by N. Dolendra Prasad. Ph: 091-861-2327354, Offset Printing at Zaminryot Press, Nellore. E-mail : jaminryot@yahoo.com